ఈ ర చ యి త వే —

సారంధ్ర ( పద్యకావ్యము )

అరుణ కిరణాలు ( ఖండకావ్యము )

ఉల్టా — సీదా ( Satire )



ము ఖ చి త్ర ము :-

శ్రీ అంకాల వేంకట సుబ్బారావుగారు

భీ మ వ ర ం.

శ్రీ

# పండితరాయలు.





రచయిత

విద్వాన్ కొండూరి నరసింహం

ప్రధానాంధ్రాధ్యాపకుఁడు

శ్రీ జూపూడి గంగయ్య మెమోరియల్ హైస్కూలు

భీమవరం.



# అవతారిక.

## పండితరాయలు.



జ్యోతిర్మయమైన సంస్కృతవాఙ్మయమందిరమున నుపాసకులై యుపవసించి ప్రజ్ఞాలోక ప్రదీప్త హృదయులై, సర్వాంగ సుందరములైన కృతులను సృజించి, వాగ్దేవికి సమర్పించి యశస్తిలకులైన భారతీయులలో నాంధ్రులగ్రపీఠముల నలంకరించిరి. కాళిదాసుమహాకవికీడైన భవభూతివలె పండితరాయలు తెలుగుతల్లి కడుపునపుట్టి దశదిశల ప్రజ్ఞాపాణింధమమును మ్రోగించినాడు. ఇరువురు మహాపురుషులును గోదావరీతీరమున నుదయించినవారే!

ప్రకృతి గ్రంథమందలి పుటలలో మనోహరధునీ దృశ్యమొకటే ఏవన్ శైవలినీకూలమున జనించిన షేక్స్పియర్ మహాకవి చదివిన చదువంతయు నీ గ్రంథములోనిదే! సత్యలోకములోని సరస్వతివలె, కుంజవాటికలో, మాలతీ మందిరములో, శాంతియుత గురుకులములో పరిఢవిల్లు ప్రకృతిమాత నాశ్రయించి, ఆమె స్తన్యమున్గ్రోలి కవిడింభకులు అనల్ప ప్రజ్ఞనంది మురియుచుందురు. నింగినుండి జలజలరాలు చంద్రికలను కబళించి కడలిలోని కరళ్లుప్పొంగునట్లు కళోపాసకుని హృదయమందలి నైసర్గికప్రతిభ చైతన్యార్కమరీచి గుచ్ఛము స్పృశించినంతనే ప్రఫుల్లముఖియైన శతపత్రసుందరివలె నవనవోన్మేషశాలినియై వెలయును.

శ్రీరామునకు గోదావరీసరిత్తీరము లెట్లు సంతోష జనకమైనదో సౌందర్య పిపాసువులైన కవులకును ఆ ఋషీమతల్లి ప్రమోదదాయకమై పూతభావసరిల్లాసమయై వారి కృతులందు వెలారెను. రామ కథామృతమును జగతికి ప్రసాదించిన కవికోకిలవలె భవభూతి పండితరాయ ప్రభృతులు కవితా పీయూషమును ఆనందవర్తుల మానసాంబులందు నొల్కించిరి. కోయిల కూతలలో, రాయంచయొయ్యారములో, నెమలి నెలత సింగారములో, ఇందిందిర ఝుంకృతిలో, వికసితకుసుమ హృదయములో, జాంబూనదమయూఖములో, చుక్కచెల్వ కనుసైగలో, చిరుతరగల గుసగుసలో వెలయు సృష్టికర్త యుద్దేశములను గ్రహించి సుజ్ఞాన బంధురములైన సూక్తుల నుచ్చరించిరి. వియన్నదులైన గోదావరీ గంగలనాశ్రయించి, సౌందర్య సందీపితమైన ప్రకృతి ప్రబోధించు పాఠములకు వీనులొగ్గి, భావోద్వేగ భరిత హృదయుడై జగన్నాథ పండితుడు ఉదాత్త కృతులను రచించి సారస్వత సామ్రాజ్యమున సమున్నతుడై యొప్పెను.

విద్వాన్ కొండూరి నరసింహంగారు ఈ మహాత్ముని కవిత్వములోని తత్త్వమును, జీవితమందలి మహత్త్వమును హృదయంగమొనరించుకొని, అనల్పమైన శక్తితో ప్రస్తుత గ్రంథమును రచించిరి. గ్రంథమందలి ప్రతి పద్యము రసబంధురమైయున్నది. రంగారు బంగారు కయి సేతలో నవరత్నములను స్థగితమొనరించు శిల్పివలె, తమ వాగ్భూషణములందు వీరు వెలలేని మానికములుపోలు తలపులను జొనిపిరి.

ఎట్లవసరమో సుందరశబ్ద గ్రథన మందలి కౌశలముకూడ అట్లే యవసరము. కఠిన శిలలతో నగ తయారుకాదు. వాడి కంటకములతో లలితమైన మాల సృష్టి కాదు. శయ్యలోని సౌకుమార్యముపై కవి మనసు నిలుపును. సౌష్టవ సంపన్నమై, సౌందర్యరాశియైన కావ్యరమను సృజించుటకై ఈతడు తపించును. రసానుభూతినంది పాఠకలోక హృదయమున నీతడు రసరత్నాకరమును సృజించును. జీవాత్మకు సదనమై దాని చెయువునకాటపందిరియై అధిష్ఠానమై శరీరమెట్లొప్పునో భాసురభావమునకు సముచిత భాషయట్లే కనమరు శరీరగ్రథనమై తనరును.

విపణివీథిలో వణిజులు తమ వస్తువులను ప్రదర్శించునట్లు కవీంద్రుడు తనయూహాలను బట్టబయలొనరింపడు. అల్పాక్షరములందనల్పార్థము నిమిడ్చి వ్యంగ్యభూయిష్టమైన రచనమునతడు సృష్టించును. చిన్న మల్లికనుండి వెలారు పరిమళము సర్వదిశలందెట్లు గుప్పున నుప్పొంగునో సుమసదృశ సుకుమార పదమునుండి విశ్వవిస్తృతము కాజాలు భావ సౌరభముద్భవించును.

తన హృదయ క్షేత్రమున పడిన భావబీజమునుండి తన పైడి పంటను తానే పండించుకొనవలెనని ప్రతిభా సమన్వితుడైన పఠిత మక్కువపడును. ధ్వనిగర్భితమైన సాహిత్యసృష్టిపై దృష్టిపడినపుడే నిజాశయచరితార్థతగాంచి యాతడు మురియును. పాఠకుని మనసునకు వ్యంగ్యము ప్రీతికరమైన కొంతపని కల్పించును. సందర్భశుద్ధిని గమనించి, ఔచిత్యమునను సరించి, పదప్రయోగమొనరించి, రసభరిత భావస్వాదాశయమండిత వ్యంగ్యవైభవ ప్రదీపిత కృతులను సృష్టించు కవియే అట్టి పఠితకు ఆరాధ్య దైవతమైయుండును.

ఈ సాహిత్యాశయముల నెఱిగియే విద్వాన్ నరసింహంగారు ప్రస్తుత గ్రంథమును రచించిరని ఇందలి పంక్తులను చెప్పవాల్పక పరిశీలించు పాఠకులెఱుగుదురు. వీరి శిల్పకౌశలమును పరమానందముతో ప్రశంసించుచు, మన మహాకవులందు వీరున్నత స్థానమలంకరించువారని ముక్త కంఠముతో వచించుచున్నాను.

రమణీయమైన ప్రకృతి కవితకెట్టి భావశబలత నొసగునో తొలుత దెలిపితిని. సకల కళ్యాణ సాహితీ చక్రవర్తులెనయు నుపనిషదాళికి హృదయసీమయైన కోనసీమలో, జనించిన జగన్నాథుడు ప్రకృతి వలన పడసిన అభ్యుదయమును శ్రీ నరసింహముగారు చక్కగ వివరించిరి. చూడుడు.

నవచైత్రపుష్ప సన్మాన సౌరభవీచి
తన వాసనా జ్ఞానమెనసిచూప
పాషాణభేదనా పాటవగ్రీష్మాత
పచ్ఛాయ- వాగ్వాద పటిమనింప
రసమూర్తులౌ దివ్యరమ్య మేఘవితతి
జీవితపరు భూమి నేదఁదేర్ప
స్నిగ్ధమందర చలత్ శీతలవాయువుల్
మానిత కమ్రనమ్రతనునేర్ప

ప్రకృతియను పాఠశాల లోపలను మసలి
చిల్కలును, కోయిలల్ కూడి- చేరి- చదువ-
అలరి శృంగారరస వీధులందతండు
ప్రౌఢుఁడౌట యెఱుంగరు- పౌరులపట.

వీరి భావనాశక్తి అద్భుతమైనదని దృష్టాంతీకరించు పంక్తులెన్నో గ్రంథమున గానవచ్చును.

బంగరుతీగలన్నియును బైకొని రంగులఁబూసినట్లు సం
ధ్యాంగన కంకణాగ్రరుచులందు వెలింగెడి గౌతమీనదీ
సంగలసత్తరంగముల స్నానములాడెడి భాగ్యమింక మా
కుంగలదా" యటంచు మదికోర్కెలుమాత్రము బెగ్గడిల్లెడిన్.

మామిడిగున్ననీడలు, ఘుమంఘుమలాడు కవిత్వలేఖినీ
ప్రేమగభీర హృద్భ్రమరలీలలు, లేతచిగుళ్ల నెయ్యముల్,
కోమలకోకిలార్ద్ర కలకూజిత బంధురగంధ బంధముల్,
ఏమరియుందమన్న భ్రమియించి కలంచును లోనిలోకమున్.

ఒక శరదాగమనంబునకై- ఉబ్బిరి- దంపతు లేయలౌక్య ప్రే
మకృత మధూర్మికానికర మాధురులందిరొ; ఏ విశాల రా
గకలిత నూత్నచంద్రికల- కమ్మని- తేనెలనానిరో? వినో
దకృతి విలీనమైనది సదాగతి స్వప్నకథాక్రమంబునన్.

వాకిట లేగులాబుల గుబాళల పైఁబయినల్లిబిల్లిగాఁ
ప్రాకిన సన్నజాజిఁగల పందిరినుండి శశాంకరేఖికల్
సోకినవేళ-నీనయన సుందరదృష్టి సువృష్టులై ననున్-
తాకినవంచు- కల్పితవృథా పరితుష్టులు కష్టమౌ ప్రియా!

కల్పితరంగవల్లుల ధగద్ధగలీను హృదంతపీఠికన్
నిల్పి, అనల్పరాగరమణీయసుమాంజలులిచ్చికొంచు సం
కల్పవికల్పభావముల కామితమంచు మనోజుఁగొల్చు, వా
క్శిల్పుల నూత్నదంపతులఁజెందుట న్యాయము? ఆవియోగముల్.

పండితరాయని దేశభక్తి నీకివిందు రీతెట్లుల్లేఖించెనో వీక్షింపుడు.

తెనుగుందేశము కొమ్ములున్న లసదుద్దీప్తాగ్రసత్పండితీ
ధనులున్నట్టి పవిత్రభూమియని, ఆ దర్బారు గుర్తించ నా
యనుఁగుందల్లికి మ్రొక్కి "జై" యనుచునిత్యం బఢ్రవీధిన్-వెలుం
గనుజేతున్— కవిరాజ రాజపదలక్ష్మీర్ధ్వ ధ్వజోత్తంసమున్,
నేయత్నించి నవాబు డెందమున వాణీవీణ శబ్దించి, స
త్యాయత్తప్రతిపాద్య నిత్యయమకాంతర్భూత సుశ్లోక హృ
ద్యేయుంజేసి, మదీప్సితార్థపద మస్తేయంబుగా నొందినన్
నా యాంధ్రవని దేశదేశముల సన్మానంబునుంగాంచదే?

జగన్నాథపండితుని జీవిత చరిత్రలో ముసల్మాను సంపర్కము, యవనయువతీ సాంగత్యమను రెండు ముఖ్య ఘట్టములు గోచరించును. వీని విషయముల్లేఖింపబడినపుడు ఎందరెందరో యులికి పడుచుందురు.

ఒక మహాపురుషుని జీవిత విధానమునుగాని, ఒక మహా కవి రచనా కౌశలమునుగాని గ్రహింపవలెనని మక్కువపడు సత్యాన్వేషి వ్యక్తిగుణగ్రథనమునకుతోడైన సమకాలపరిస్థితులను, స్థలపరిస్థితులను జాగరూకతతో పరిశీలించును. నేఖాక కాలమందును, స్థలమందును ప్రచలితములైన సూత్రములను, సిద్ధాంతములను పురస్కరించుకొని చేయువిమర్శ దోషభూయిష్ట(anachronism)మగును.

క్రీస్తు శకము 15, 16, 17 శతాబ్దములందు భారత వైజ్ఞానిక రాజకీయ చరిత్రలెట్లు నడచినవో తెలిసికొనినపుడే పూర్వోక్తఘట్టము లను నిష్పాక్షిక దృష్టితో వీక్షింపజాలుదుము.

వైష్ణవమత ప్రాంగణము కడుంగడు విశాలమైనది. క్రీ॥ శ॥ పదునేనవ శతాబ్దములోవరలిన శ్రీచైతన్యస్వామి శిష్యులలో ముఖ్యులు ముప్పురు ముసల్మానులు. వీరిలో ప్రధానుడైన యవన హరిదాసు

అక్బరు పాదుషా ప్రిస్తుతినందినాడు. శ్రీ రూపసనాతన గోస్వాములు హిందూమహమ్మదీయుల భక్తిశ్రద్ధలను పడయువారు, వారణాసిలో వసించెడు ముసల్మాను నేతగాడు రామానందుని శిష్యుడై రామసంకీర్తనమొనరించువాడు. సిక్కు మతస్థాపకుడైన గురునానకు హిందూ మహమ్మదీయుల మతములనుండి బహుళాంశములను గ్రహించెను. రాజకీయ రంగములో హిందూ మహమ్మదీయ సఖ్యమునభిలషించిన అక్బరు వైజ్ఞానిక ధార్మిక ప్రాంగణములందలి పూర్వోల్లిఖితసామరస్యమును గమనించి అది తన యాశయసిద్ధికి తోడుపడునని విశ్వసించి సర్వతోముఖ సంఘీభావమునకు వలసిన వ్యవస్థలను స్థాపింపగడగినాడు. అశోక, కనిష్క, శ్రీహర్షులు హిందూ బౌద్ధవిజ్ఞాన మహోద్యమములకు ప్రోత్సాహములను చేకూర్చినట్లు అక్బరు, షాజహాను చక్రవర్తులు హిందూమహమ్మదీయ విజ్ఞానముల కలయికకై శక్తివంచనలేక కృషిసలిపిరి. ఇరుజాతుల వారికి వివాహములు చేయించిరి. షాజహాను శరీరములో సగము హిందూరక్తము ప్రవహించెను. ఆతని పెద్దకొడుకైన దారా సంస్కృత పరిష్యన్ భాషలందు కోవిదుడు. ప్రధానములైన ఉపనిషత్తులను, యోగవాసిష్టమును, భగవద్గీతను పరిష్యన్ భాషలోనికి అనువదించెను. షాజహాను తరువాత, నియమము ననుసరించి జ్యేష్ఠపుత్రుడే చక్రవర్తియైయుండినచో, మన చారిత్రిక స్రవంతి పీయూషభరితమైయుండెడిది. అందు రక్తపూరమును భారతాంబ కన్నీటివెల్లువ చేరకుండెడివి.

దారాకును, పండితరాయలుకును ఆంతరంగికమైన మైత్రి యుండెడిది. విజ్ఞానకేంద్రములో నిరువురు ఒకరికొకరు సన్నిహితులైయుండువారు. దారా దుర్మరణమునకు గురియైనపుడు పండితరాయలు ఢిల్లీ దర్బారునుండి కదలిపోయెను.

"ఢిల్లీశ్వరోవా! జగదీశ్వరోవా!" అనుచు స్వస్థలమునుండి ఉపద్రష్ట జగన్నాథపండితుడు కదలిపోయి క్షేత్రయాత్రయందు విజయ ధ్వజమునుచేబూని ఢిల్లీసామ్రాట్టైన షాజహాన్ ఆస్థానములో కవి సామ్రాట్టై యొప్పెను. షాజహాన్ చక్రవర్తి కళోపాసకుడు, సౌందర్య పిపాసువు. తాజమహాల్ తొలుత నాతని హృదయములో సృష్టి యాయెను. పండితరాయని దివ్యప్రతిభకు ఆనాడు జే జేలు పాడుటలో అక్కజమేమియులేదు. ఆతని యాస్థానమునుండి "భామినీ విలాసము" (బహామనీ విలాసము) "రసగంగాధరములు" "దేశాటనమునకై వెడలుట వింతకాదు."

ఇక లవంగి? ఈమె సుందరి, నవాబు పెంపుడు కూతురు. లవంగీపతి సార్వభౌముని జామాతయగునుగదా! పదవీప్రలోభమనుడు ఢిల్లీదర్బారు వాతావరణమనుడు, కాలప్రభావమనుడు, స్థల ప్రభావ మనుడు, సౌందర్య సామ్రాజ్య పట్టాభిషేక వైభవమనుడు, పూర్వజన్మ కర్మఫలమనుడు: ఇవియన్నియు తమసంయుక్త శక్తులను పురస్కరించుకొని ముంగండలోని పేదబాపని నెదుర్కొనలేదు. ఢిల్లీ దర్బారులోని ఆస్థానకవిని మార్కొనినవి! వజ్రసంకల్పమనుడు, అనిర్వచనీయ ధృతియనుడు— ఇవి నిష్పచ్ఛరమండలి మహావీరునకే స్వతస్సిద్ధములుకదా!

పూర్వోక్త చారిత్రకాంశములపై మనసుంచుటచే కాబోలు ప్రస్తుత గ్రంథకర్తగారు లవంగీ పండితరాయల సఖ్యమునుగుఱించి, వియోగమునుగుఱించి విపులముగా వ్రాయుటకు సాహసించిరి.

ఔరంగజేబు కాలములో హిందూమహమ్మదీయ సఖ్యముపై రాబందుగుంపు వ్రాలినది! బ్రిటిషుమహాయుగమావిర్భవించినతర్వాత హిందూముసల్మాను సంస్కృతులు మఱింత దూరస్థములగుటకు విధే

శీయ ప్రభుత్వము విశ్వప్రయత్నమొనరించి నెగ్గినది. సంస్కృతులు వేరైనపుడు గుండెకలయిక గగనకుసుమమే యగునుగదా! విషోరగము వలె వైషమ్యము విజృంభించునుగదా! క్రౌర్యము బడబానలమై ఎందరెందరినో కబళించునుగదా। ఇప్పటి దృక్పథమునుబట్టి మూడుశతాబ్దముల నాటి కవి పండితుని జీవిత ఘట్టములను పరీక్షింపరాదుకదా।

లవంగీఘట్టమెట్టిదో కాశీవిశ్వనాథుడెఱుగును. పండితరాయల జీవిత ప్రభావమును కవితావైభవమును, పరమశివునకును, లోకపావని యైన గంగాభవానికిని ప్రమోదమునేచేకూర్చెను, మహాత్ముడైన కవి వాక్కు పంచభూతములనుసైతము శాసింపగలదు. పండితరాయలట్లు శాసించి విజయుడాయెను. అతని వాగ్ఝరిలోని మహిమవలన గంగాఝరి పొంగినది. తన్మయత్వమందు మునుంగు ముని హృదయమట్లు పండితరాయలు దివిజకల్లోలినీ ప్రేమపూరమున మునింగెను. నిష్ఠురులెవ్వరైన ఆ మహాత్ముని జీవితమున నెరసుచూప సాహసించినను, అదియాపూరమున ఘాతమైనదని గుర్తింతురుగాక!

ఈ పవిత్ర గ్రంథమును ముద్రింపించి కొనగొన్న మహనీయులు శ్రీ రాజా జూపూడి కేశవరావు జమీందారుగారును, పండితరాయల జీవితమందలి తుదిఘట్టమును నేరిమితో ముఖపత్రముపై చిత్రించిన శ్రీ అంకాల వేంకట సుబ్బారావుగారును వందనీయులు.

ఆంధ్ర మహాజనులు ముఖ్యముగ సారస్వతోపాసకులును, విద్యాధికులును, విద్యార్థులును ఈ గ్రంథము నాదరింతురుగాక!

Camp :- కలకత్తా,
25—6—1949.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి,
M. A., B. L. Etc.
Lecturer : S.R.R. & C.V.R. College
BEZWADA.

# అ భి ప్రా య ము.

మిత్రుడు విద్వాన్ కొండూరిచే రచియింపబడిన "పండితరాయలు" అన్యంశము పరిశీలించితిని.

ఆంధ్రుల గీర్వాణభాషా వైశద్యమునకు భారతసీమల జయధ్వజమెత్తిన రసగంగాధరకర్త జీవితమందలి రసవత్తర ఘట్టములను సుకుమారశైలిలోఁజూపఁగల్గిన కవివస్యుడు. ప్రతిపద్యరసోచితమైన భావశబలత యలవడుటచే, పరిణతశబ్దసంగ్రథనమున ప్రౌఢిగనుటచే "విద్వాన్ కొండూరి" కవిలోకమునకుజ్వలరత్నమైనాడు. యువకలోకమునవీతనికి సమున్నత భావి గోచరించుచున్నది.

జగన్నాథపండితుని చైత్రయాత్రి నీతడు హృద్యముగా చిత్రించినాడు. లవంగి పండితరాయల వియోగమునీతడు వ్యంగ్యముగ, ప్రౌఢముగ రచియించి చక్కని శిల్పియని ఫించుకొనినాదని నా విశ్వాసము.

ఆయుద్యానపుఁ బూవులీగిరులలోయన్ బూయుపుష్పంబులున్
సాయుజ్యంబునుగోరి శీర్షములవంచన్ స్వామిపాదంబులం
దేయౌదార్యముఁజూపునాతడు ప్రియా ! ఏమెంచుచున్మానవుల్
ఈయుద్ధంబుల జాతిజాతికని కల్పింతోరియనంతంబుగన్.

అను పద్యము పవిత్రతమమగు జాతియైక్యతను ప్రబోధించుచున్నది. ఈ భావసూత్రముపై నవలంబితమైన పండితరాయల జీవితవృత్తము పునీతమైనదనవచ్చును కవి, పండితుడు, సంస్కర్త, సౌందర్యోపాసకుడు, రాజకీయవేత్తయగు పండితరాయని ఈషల్లలిత కళారేఖలరూపించి విద్వాన్ కొండూరి యథోచిత భాషాసేవ చేసినందులకు ప్రశంసార్హుడు.

చూపులు తూపులై విజయశోధనజేసినవో నవోదయ
స్థాపితదీపితాగ్రకర సజ్జితహృజ్జిత రాగశయ్యపై—
ఏపరిణామ సత్పరిణయేచ్ఛల నిద్దరియంతరంగ గా
ధాపరిపూర్తి పూర్తిఁగని దవ్వులనవ్వుల నవ్వుకొన్నదో.

వంటి అనేక పద్యములు ఈ కవియొక్క శబ్దాలంకారప్రేమను చాటి చెప్పుచున్నవి. యమకకవి చక్రవర్తియగు జగన్నాథుడు ఈ కవికి అత్యంతము అభిమానుడని తెలియుచున్నది. సలక్షణమైన యిట్టి చిన్ని కావ్యములు విద్యార్థులకెంతేని యుపకరింపగలవు....

రసజ్ఞులీతని నాశీర్వదింతురుగాక.

మారుటేరు, ఉభయభాషాప్రవీణ,
20-5-1949. ఆకెళ్ల గోపాలకృష్ణ శర్మ.

# మనవి

సహృదయుల యాదరాభిమానములచే నా కవితాలత చిగురులు తొడిగి, మొగ్గవిచ్చనుద్యమించినదని నా విశ్వాసము. కించిజ్ఞులు కృతులు సృజింప సాహసించుట వింతయేయగునుగదా ? నా యీ స్వల్పభాషాసేవకు దోహదమిచ్చుచున్న మిత్రులందఱికిని కృతజ్ఞుఁడను.

అనవరతము నాకవలంబనమై యాదరప్రోత్సాహములనిచ్చుచున్న శ్రీరాజా జూపూడి కేశవరావు జమీఁదారువారికి ఆజీవితము ఋణబద్ధుడను.

బహుభాషాకోవిదులు, ఉపన్యాస చక్రవర్తులు, విమర్శకాగ్రేసరులు నగు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, M. A., B. L. గారి "అ వ తా రి క" మకుటాయమానముగ నా గ్రంథమునకు లభించుట నాయదృష్టము. వారికి నా సవినయపూర్వక నమస్కృతులు.

చిత్రకళాకుశలురు, అంతర్జాతీయ ఖ్యాతిగొన్న లలిత కళానిధులునగు శ్రీ అంకాల వేంకట సుబ్బారావుగారు ముఖచిత్రము వ్రాసి నా గ్రంథమున కలంకృతిఁదెచ్చిరి. వారికి నా ధన్యవాదములు.

దీనిని సుందరముగా నచ్చొత్తి యిచ్చిన "ఉ ద యి ని" వారికి నేకృతజ్ఞుడను.

నా యభ్యుదయమునభిలషించి యీ చిన్ని కావ్యము నాదరింతురని పాఠకలోకమునకు వినతిచేయుచున్నాను.

వినమ్రుడు,
విద్వాన్ కొండూరి నరసింహం.







పోషకులు
శ్రీ రాజా జూపూడి కేశవరావు
జమీందారువారు
భీమవరం.

రచయిత
విద్వాన్ "కొండూరి"





# పండితరాయలు

అతఁడు పసిడికిఁ బరిమళమబ్బినట్లు
గుణము నమ్రిత గల్గిన కోవిదుండు
కాని—ఏండ్లును పూండ్లును గడచుచున్న
కడుపునిండించుకొను త్రోవఁగానలేఁడు.

చదివిన దానిలోన, సరసత్వము చిప్పిలు సత్కవిత్వ సం
పదల వెలార్చి, శాస్త్రపరిభావన మ్రోడగు జాతికాయువున్
పదును లగించి, పేర్వడసి, పండితసత్కవియయ్యె, ఐన, ఆ
హృదయము సొమ్మసిల్లినది, ఏమి వచించిరచింతునాతనిన్.

తాను జన్మించినదియొ విధాతృకులము
సకల కళ్యాణసాహితీ చక్రవర్తి
తెనయ్యు నుపనిషదాళికి హృదయసీమ
కొమ్ముతిరిగిన కవులుండు కోనసీమ.

నాణెమగు పేరుగా జగన్నాథుఁడనుచు
తల్లిదండ్రులు పిలుచుచుఁ దరలినారు
వాని జన్మము ముక్తి సోపానపంక్తి
సృష్టిఁ జేసెనటంచు వచించఁ బ్రజలు

త్రోవలులేక వేరొకట - తోరణముల్ తెగఁద్రెంపి త్రెంపి, సం
భావనలూచిలాగుటకుఁబర్వెడునా శతమర్కటమ్ములం
దేవముఁజూపునాతఁడు మహేశుకృపన్ జనియించినట్టివి
ద్యావినయోదయ ప్రథితధర్మనిబద్ధ వచోవిభూతిచే.

వేదయుగంబు కన్మొగుచుబిమ్మట, బ్రాహ్మణజాతికాయువుల్
భేదిలువేళలందు - నిరుపేదకుటుంబములోజనించ, స
మ్మోదమునందగాఁదగునమోఘయశఃప్రసవాభివృద్ధి సం
పాదితమెట్టులౌను ప్రభఁబాసిననీతివిరుద్ధ భూమిలో.

తానుధరించుకొన్నది - యథాతథమార్యవిభూతి సంస్థితో
ద్యానపరీమళత్కుసుమదామము, తద్గళసీమలోన పెం
పూనమెఱుంగులీను - అదివోయిన - ఏబిరుదేనిలేదు సం
స్థానములందునార్భటిగ స్థానముఁగొందమటంచునెంచినన్.

తానుగడించుకొన్నది - వృథాగనెకాలములోన లీనమై
మేను త్యజించునన్న భయమేమియులేని పరార్థసత్క్రియా
ఖ్యానమహాంధ్రసంస్కృతి, -అఖండముగావెలుగొందు-అంతియే
కాని - కనంగరావితరకామిత సంపదలొక్కటేనియున్

తాను వరించుకొన్నది - వృథాసమయించు నటంచు, ఛాందసుల్
పూనఁగ భీతినొందు పరిపూతమనోజ్ఞ మహాకవిత్వ సం
ధానము, - కాని - యౌవనముదమ్మును వమ్మునుజేయువై దిక
ధ్యానము కాదు - అద్దివన దర్పమెలర్పగలేదు వానిలో

పదునారేడులు నిండిపారిన కవిబ్రహ్మర్ద్రి వాక్పూరసం
పదలందేలినయాతఁడెన్నఁ డును లోభావింపఁ డేదోవిధిన్
మది తృప్తిల్లగ - ఏవిలాసినినొ లేమన్ - పెండ్లియాడంగ - బొ
నదియున్ జెల్లునె బీదవాఁ డు హృదిలో వాంఛించియేమెంచినన్

పేదరికమ్ము సుళ్ళగసి, పీడనుబెట్టినలెక్కఁ జేయఁ డొఁ
గాదనుసందియమ్మెనసి, కాయమువోయినఁ జేయిఁజాచఁడొ
రా - దినమెట్టులేఁ గునని యాతఁడు ధైర్యమునందునా? సుధా
మోద కవిత్వసంపదల మున్గిన వానికి రాజ్యమేలనో?

గౌతమిలోనమున్కలిడి, కాంతులఁజిమ్మ విభూతిరేఖలం
దాతరుణుండు, కావి, మెయిఁదాలిచి, బంగరురంగులీను బా
లాతపభాసి భాస్కరునిహాస్యము చేయఁగలట్టివాఁడు- జౌ
నాతఁడుషస్సతీ హృదయమందె శయించినమూర్తుఁ చెట్లగున్

తన పాండిత్యము - ఉప్పరాతికనిరాదంచెంచి, ఆతండునె
మ్మనమందెట్టియధైర్యమున్ బడఁడు - సామ్రాజ్యంబుగెల్వంగజా
లినదీసత్కవితావధూటియని గర్వించున్ "భళీ"యంచునే
ధనమున్గోరఁడు, వానిచిత్తమటు సన్మానంబునే కోరెడిన్.

తనకవిత్వామేయ దర్పాతియమకమ్ము
గౌతమికే నడకలను నేర్పె
తనగానమాధుర్యధార వారక పొంగి
స్వర్గలోకంపు నేస్తమును గాంచె
తనప్రౌఢవిజ్ఞాన తార్కికవిభవోక్తి
సంజ కెంజాయల ఛాయనింపె
తన సాహితీ మహో ధర్మగర్వవిలాస
శేషుని శీర్షమున్ జీల్చివేసె

తాను పట్టిన పట్టులో ధర్మమెఱిఁగి
కార్యసాధనముం జేయు కవియతండు
ఆ జగన్నాథు సాటి చేయంగదగిన
దేమియున్నది, కన్నదీ, సృష్టిలోన.

చిటి పొటి పద్దెముల్ చదివిచెప్పెడి వాని మృదూక్తిలోన-ఏ
పటునట నాకృతింబడి ప్రపంచము లూగునొ, ఏ మనోల్లసత్
స్ఫుటద మృతాంశువుల్ తెరలి భూతగణంబులు తృప్తినందునో
అటఁ గలవారెఱుంగరు పరాన్నభుభుక్షులు వారలందఱున్.

ఏమో! జగ్గడువ్రాయు నిక్కయితకై, ఏరాజు మోహించి, స్వ
ర్ణామోదోత్తమ సింహపీఠినిడి యీయంబోవునో గ్రామముల్?
ఏ మూర్ధన్యుఁడు పాలకీయిడునొ, తానేమంత్రి—పై మోయునో-
ఈమూర్ఖుండు తలంచఁడంచు వెటకారింత్రేగదా- ఛాందసుల్.

ప్రతి పద్యంబు రసోచితంబయి, ప్రభల్ పండించి, సర్వజ్ఞ స
మ్మతినే మూల్యముఁగాంచి, ఎన్నియుగముల్ మాయించరానట్టిసం
స్తుతి సన్మానములంది దీప్తిని మహాతూర్యంబు మ్రోగించునో
మతి నూహింపరు విప్రనామకులు భూమ్యాకాశ సంశోధకుల్.

ఇంతవఱకును పొలిమేర లెరుకలేని
వీనికవితకు మెచ్చెడి వెఱ్ఱియెవఁడు?
మించి కనకాభిషిక్తుఁ గావించు నెవఁడ
టంచు నిగిలించు నటజన సంచయంబు.

నవచైత్రపుష్ప సన్మాన సౌరభవీచి
తన వాసనా జ్ఞానమెనసిచూప
పాషాణభేదనా పాటవగ్రీష్మాత
పచ్ఛాయ- వాగ్వాద పటిమనింప
రసమూర్తులా దివ్యరమ్య మేఘవితతి
జీవితమరు భూమి సేదఁదేర్ప
స్నిగ్ధమందర చలత్ శీతలవాయువుల్
మానిత కమ్రనమ్రతనునేర్ప
ప్రకృతియను పాఠశాల ~~[illegible]~~ మసలి
చిల్కలును, కోయిలల్ కూడి- చేరి- చదువ-
అలరి శృంగారరస వీథులందతండు
ప్రౌఢుఁడౌట యెఱుంగరు- పౌరులచట.

అతఁడు దయాస్తమాన సమయంబులనుండి గ్రహించెనెప్పుడో
చితిఁబడి, కాలి, చల్లఁబడి జీర్ణమగున్- తనువంచు- ఇంతలో
మతినెదురయ్యెఁగీర్తిఁగొను మానవుఁడే చిరజీవియన్న భా
వతతి- అంతయాత్రికయి వర్తిలె- తత్సము పార్జనార్థియై-

వెలుచన్- పండిత కాండమున్ గెలిచి దిగ్వేదండ తుండాగ్ర కీ
ర్తిలతాసూన మనూనమౌగతి సమార్జింపంగ వాంఛించునే
తలపుల్ చిప్పిలి గుప్పుమన్నవియొ- తత్పాండిత్య తేజోమయుం
డలతిన్ వెల్వడె- జైత్రయాత్రికయి- గీర్వాణాభ్రవీథీతతిన్

ఎంతఁజూచిన తన కవితాంతరంగ
భంగసరణిని గుర్తించు ప్రాజ్ఞుఁడేడి
సరస ముద్గరసాలాగ్ర సీమలందు
గంతులిడు మర్కటాళి ముఖాలుతప్ప.

రచ్చంగట్టులనిల్పి సజ్జనుల దుర్భాషాళి భూషించు వా
రిచ్చవచ్చిన రీతిఁ గూతురుగ- తానేలాగణింపంగ, •నే
డిచ్చో చచ్చిన జన్మవ్యర్థమగు' నంచెంచంగ- ఆ డెందము
న్నైచ్చో నేగుట కామతించినదొ- సాయించెంగదా యాత్రకై.

శాలి, కోనసీమ బయనించినయాకవిచంద్రు సాంద్ర రే
ఖాలి, ఖగోళఖాస్థలసమావృతదిగ్విజయార్ద్రకీర్తికాం
తాలలితమ్ముగా-శిలుసంపా ప్పనటంచు దలంచ నేరదీ
క్ష్వాలయ యుక్వదగ్రమగుఖాందసకోటి రసజ్ఞహాన్యతన్.

అడుగున్ ముందుప సాగవేశ తనయాత్రార్థమ్ము-నేడున్న ఆ
తడికల్ కూలినపూరింపుల్లపట-వద్దంచుంబ్రిమ్మాదించునా?
కొడుకున్ పీడిన తల్లిదండ్రులు ముముక్షల్ వచ్చి రోధింతురా?
విడువన్ శంకిలనేల? ఆస్థలి-యశోపీఠీ విహారాస్థలో

పేరునాశించు మనుజు లెవ్వారు.గాని
స్వీయనగరంబు విడచుట శ్రేయమౌను-
ఇంటిగెల్వక రచ్చగెల్వేమిలేద?
పెరటి చెట్టురె మందురావరయనిజము.

“పాండిత్యంబునఁబ్రజ్ఞతేనియతఁదే భావాలలోముగ్గిబ్రి
హ్మాండంబంతటి కావ్యకర్తవతె వ్యాహారింపఁగా గోరు-ఆ
తండంబున్-కృతకృత్యతన్ గననిచో దర్పించిపౌరాణికో
ద్దండుండౌ-అదిలేక-దోషగుణ విస్తారార్థవ్యాఖ్యాతయో”

అనుచు నీరీతిలోక యథార్థపురసం
సేరకయు పల్కు— శుష్క నిశితబుద్ధు
లుంతు వాప్రుల విడి, రసలుబ్ధులుండు
ధర్మభూముల వెదకఁగఁ దరలెనతఁడు.

వ్రాసినపద్దెమున్ విని"భళాయని మెచ్చఁగఁలేని మూర్ఖ స
న్యాసులవద్ద వాసిఁగననౌనె కవీంద్రుడు-పూర్ణచంద్రికా
న్యాస సుధారసమ్ముఁ దనివారఁగఁగ్రోలని కాకఘూక మి
థ్యాసమితుల్-రసజ్ఞత సుదాత్తముగా-వివరించనేర్చునే?

పలుకుందొయ్యలి చేతివీణియ కవిబ్రహ్మస్వరంగస్థలిన్
చల దశ్రాంతమనోజ్ఞ షడ్జమయుతస్థాయిన్ ధ్వనింపంగ, మీ
రలు మీరల్విని గౌరవింపుఁడని బారల్సాచియాహ్వానముల్
సలుపంగావలసెన్-రసజ్ఞతలు నిస్సారమ్ముగా మారుటన్

జ్ఞాతివర్గంబుపై గల్గురోతకొంత
జైత్రయాత్రకు వెడలు నుత్సవముకొంత
అడుగుసాగించబోయిన-అతనిహృదయ
కోశమున-లేకపోలేదు-కొంతచింత.

"బంగరుతీగలన్నియును బైకొని రంగులఁబూసినట్లు సం
ధ్యాంగన కంకణాగ్రరుచులందు వెలింగెడి గౌతమీనదీ
సంగలసత్తరంగములు స్నానములాడెడి భాగ్యమింక మా
కుంగలదా" యటంచు మదిఁగోర్కెలుమాత్రము వెగ్గడిల్లెడిన్.

మామిడిగున్ననీడలు, ఘుమంఘుమలాడు కవిత్వతేఖని
ప్రేమగభీర హృద్భ్రమరలీలలు, లేతచిగుళ్ళనెయ్యముల్,
కోమలకోకిలార్ద్ర కలకూజిత బంధుసగంధ బంధముల్,
ఏమరియుందమన్న భ్రమియించి కలంచును లోనిలోకమున్.

తనసాహిత్యవిశాలమూర్తికిని ఛత్రింబుంచి-విజ్ఞాన జీ
వన సౌభాగ్యపదోపదేశియగు నవ్యాంధ్రీపురంధ్రీమణీ
మణినిక్వాణ సువాక్ప్రచారధరణీ మధ్యంబునోనాడి-ఏ
జనభాషావృత సీమనోబడుటకై-శంకించునా పాదముల్

దిల్లీపాదుష శిల్పపాండితి కళాధీనుండు, విజ్ఞాని, సం
పల్లాభంబులఁగోరివచ్చెడి కళోపాసుల్-కనన్ వచ్చినన్-
అల్లాపేరిట సత్కరించును మతేర్ష్యావిష్టుఁడే కాఁడటం
చుల్లేఖించు ముసాఫిరుల్పలుకులే ఉద్వేగమౌ గుండెలో.

బహుమానంబులకేమిగాని, నను, సంభావించి దర్బారులో
నహా! శతంబె, షెబాషు రాజకవి యంచాడంగ, హాయెత్తుతే
కహాముస్పీడి, తదన్యపండిత మహాగర్వాతిరేకంబు ని
స్స్పృహనొందన్-మజ్-ఏ మితావలెను దర్పింపంగ నావాణికిన్.

ఆహా! ఎక్కడిదేన సీమంగల ముఖంగండాగ్రహారంబు?- ఈ
సాహిత్యార్ణవమూర్తి యెవ్వడొకొ? రాజా స్వాగతంబీయగా-
ఊహాపోహల దాటు గౌరవమదేమో! అన్నయాశ్చర్య సం
దేహంబుల్గలిగించు నాడుగద: ఆంధ్రీ మాతృసంతృప్తి యుక్తా.

దక్షిణదేశ సంస్కృతి, ఉదాత్త గభీర రసత్తరంగిణీ
శిక్షిత వాక్సుధాపరిస్రుతి స్నిగ్ధ మధూదయనవ్యరేఖితా
దీక్షిత సత్కవిత్వకృతి తేటపడంగ నవాబు హృద్దయా
లక్షితరమ్య సీమల నలంకృతి సేతున? నాయుపజ్ఞచే.

తెనుగుందేశము కొమ్ములున్న లసదుద్దీప్తాగ్రసత్పాండితీ
ధను లున్నట్టి పవిత్రభూమియని, ఆ దర్బారుగుర్తించ నా
యను గుండెల్లికి మ్రొక్కి "జై" యనుచు నిత్యం బభ్రవీధిన్-వెలుం
గను జేతున్- కవిరాజ రాజపదలక్ష్మార్హా ధ్వజోత్తంసమున్.

నేయత్నించి నవాబు డెందమున వాణీవీణ శబ్దించి, స
త్యాయత్తప్రతిపాద్య నిత్యయమకాంతఖ్యాత సుశ్లోక హృ
ధ్యేయుంజేసి, మదీప్సితార్థపద మస్తేయంబుగా నొందినన్
నా యాంధ్రావని దేశదేశముల సన్మానంబునుంగాంచదే?

అనుచున్ రాజనరేంద్రపట్టనము-, సింహాద్రిన్- సమీక్షించి, తాఁ
గనియెన్ ముంగల, పుణ్యాతీర్థమును, రక్షాదక్ష శిక్షోగ్రగల
క్షణ లక్ష్మాంచిత దివ్యమూర్తి పదమున్ స్వాఖ్యాంక విభ్రాజమున్
క్షణకాలంబున పాపముల్దులుచు స్థానమ్మున్ జగన్నాథమున్.

తానంబాడి పవిత్రతోయముల- సంధ్యన్వార్చి- పర్వాన- అ
జ్ఞానాంధ ప్రతిరోధ దివ్యకళికా సద్రూపు చిద్రూప స
న్నానాలోక సృజత్కృపామయు జగన్నాథుం బ్రశంసించె, శ్ర
ద్ధానమ్రార్ద్రహృదంతరంతరిత సద్యః పద్యగద్యాత్ముఁడై,

శ్రీ సన్మంగళమూర్తి! ఆర్తజన సంశ్రేయోభిపూర్తీ! భవ
న్నామాంక ప్రతిపాద దివ్యతను నన్ రక్షించవాంఛించినన్
క్షేమారోగ్యయశః ప్రపూతునిగ సృష్టింపంగలేవా? ప్రభూ!
నీ మంబన్న నెఱుంగలేని జనుఁడన్ నిన్నేమదిన్ నమ్మితిన్.

నీ కరుణావతేశమున నేర్చిన సత్కవితావిలాస లా
స్యాకృతి భారతీయ హృదయస్థలి నిల్పి నటింపఁజేసి, ఆ
నాకనివాసులున్ పొగడునట్లు- యుగాలయుగాలకేని స్వా
మీ! కుమిలించు- మాతబుణమీగు విధానమెనర్చ రావొకో?

చల్లని నీదయా హృదయ సారమరందముఁగ్రోలి యుంటచే-
ఎల్లి- సమస్త భారత కవీంద్రు రణస్థలి భేరికొట్టి- రా
జిల్లెడి నాదురేఖని జయించిననాడె- భవత్పదాబ్జసం
పుల్లవిలాస రేఖల- ప్రభూ! లయమందితి నంచునెంచెదన్.

నీ సామ్రాజ్యమునందు భేదములెవేనిన్ లేవు- నీసద్దయా
కాసారంబునమున్గు ప్రాణులకు మోక్షంబబ్బు- నీతత్వమే
నా సద్వృత్తికిఁ గారణంబగుచు స్థానంబొాత విఖ్యాతికిన్
నా సామీ! రసశబ్దనాయక జగన్నాథా విలోకింపుమీ.

ఈ రీతిఁబల్కి- నట- హృద
యారాట మెటింగినట్టు లాప్రభుతేజో
సారూప్యమవతరించెను
కారుణ్యార్ద్ర దివ్యకవి చంద్రునిలోన్.

అది మొదలా కవీశ్వరరసనాంతర వాగ్రసవార్ధినుండి, స
మ్మద దరహాసభాసితరమాకృతిఁ గొన్న మనోజ్ఞచంద్రికా
వదన, యశోంగనామణి, నవప్రభలన్ జనియించి, ముందుగా
పదమిడి సాగు హస్తిపురిఁ బాయుషఁ జూప స్థితప్రతిజ్ఞుకున్.

ఏమతియుండిరైన— అతఁడేమి పఠించిన సంస్కృతప్రథా
నామిత కావ్యలోకమున- ఆయువుచెల్లని శ్లోకమయ్యె- ఏ
దో మెఱపించు చిన్న కవుబండిన సుందరదేమిలెక్క? ఆ
స్వామి పదంబులోఁ గొనఁగఁజాలిన ధన్యుఁడనన్యుఁడాతఁడే.

ఆశువునందు దిట్టయగు నప్పయ దీక్షితుఁడంత వాఁడె, స
హ్వో శిశుపాత్యభాగమగు వ్యాకరణమ్మున వాదుఁజేసి, వా
గీశ కవీశ వాక్పటిమతే జనినాఁడు పథాలఁబట్టి ది
గ్దేశములెల్ల ప్రాకి నినదించకళంకిత వార్తలెన్నియో.

ఏ వాడన్ జనినన్ జనంబు కవిరాజేంద్రుం బ్రశంసించి, శ్ర
ద్ధావిస్ఫారిత భక్తి నమ్రయుత హృన్నాళీకులై గొల్చి, వా
గ్దేవీపూజల హృష్టతుష్టులయి, సద్గీర్వాణ భాషావిభూ
షావైదగ్ధ్యముఁ గన్న ఆంధ్ర జననీసంతానమున్ మెచ్చుటే.

అది కవిమూర్తియో! ఆనందమానస
రోంతరాంతర రాజహంసయే మొ?
అది పద్యమో? హృద్యసమ్మృత వీచీరోచిఁ
గనిన గంగానదీ గమనమే మొ?
అది వాదమో? ప్రళయాభ్ర విభ్రమ ఘోర
ఘన ఘనాఘనల గర్జనమెయే మొ?
అది గానమో? దిగ్దిశాంత సంధానిత
నారదు వీణా నినాదమే మొ?

అనుచు శంకించి విజ్ఞులె యడిసికొనిరి
అఖిలపండిత జైత్రయాత్రార్థియైన
నవ్య గీర్వాణమతి జగన్నాథకవిని
తెనుఁగు మాగాణి పండించుకొనిన మణిని.

కవితల్ చెప్పుట కర్ణముల్ వగుల నేగ్రంథమ్మొ వల్లించుటో
చవులూరింపని శిల్పశాసనములన్— చర్చించుటో? వింతగా
కవి కావ్యాల విమర్శనల్ సలుపుటో? కాసంత— ఊహింపలే
ని, వృథా— ద్వేషము చూపు పండితుల— తానిర్జించె నయ్యాత్రలో.

సరస వాగ్ధాటిలేని ఆచార్యవరులు
శిష్యులకె చెప్పలేని విశిష్టమతులు
ఇతర కవులను వెనుక దూషింతురిగాని
ఆ జగన్నాథు నెదిరిన అయ్యలేఁడు.

వేణు వినోదమూర్తి వినిపించిన తీయని గానమంచు- ఆ-
స్థాణువులే కరంగుచు- సుధామధుర వాహినులైనరీతి, సం
స్థానములే చలించి- కవితాలహరీ విహరన్మనోహర
ధ్యానవిధాన- సత్ప్రణుతి నంజలిఁజేసిన వా కవీశునన్.

ఏందిర కైతలల్లుట మరేమి ఘనమ్మను పామరా?- క
మ్మందనమేమిగాంచి- అనుమానము పోనిడిరో- విలాసని
ష్యంద కవిత్వ సృష్టికి మహాత్ముఁడితండె సమర్థుఁడంచు- న
మ్మందగునట్లు మొక్కిరి సమంబుగ వ్రాలి, కవీంద్రులోపలో.

ఏ శుభలగ్నమందు పయనించెనొ కాని- విశాలదిగ్దశా
వేశయశోలతా కుసుమవేష్టిత సత్పథగామియౌచు, స
ర్వేశకృపాకటాక్ష పరివృత్త జయధ్వజ చిహ్నధారియై
దేశము కష్టమింగనక లీలఁగ ఢిల్లిపురంబుఁజేరెగా.

దవులన్ దేశమునందు- పండితులనుద్దండంబుగా గెల్చి- స
త్కవి సింహుండరుదేరు వార్త విని, తత్కాలంబునందే- నవా
బపురా! అంతటివాని నాకొలువునందాసీనుఁగాఁజేయ, మ
ద్భవమే సార్థకమౌనటంచుఁ గొనిదే, బంచెన్ వినోదాదృతిన్.

పురిపొలి మేరలందెదుర్కుఁబూన్చిన పాలకిలో, ప్రధానులెం
దరో- దరిరాగ- గౌరవవిధానసమర్పిత పూజనాతఁడం
బరతల బాలభాను విభవంబున వెల్గుచు రాజవీథిలో-
పురజనులిచ్చు స్వాగత విభూషిత భాషల నేఁగుచుండఁగన్.

సౌధాగ్రంబుల సారసాక్షులును సేసల్ చల్లి, నివ్వాళి గా
రాధా మాధవ చంపకాదిసుమ లీలందేల్చి- వాగీశుప
ద్గాథాగర్భిత జైత్రయాత్రల విచిత్రంబుల్- వినోదార్థమా
రాధించంజని రొండొరుల్ శ్రవణ పూర్ణంబై - సుధల్ చిల్కఁగన్.

పెండిలి కానివాఁడట, రవిప్రతిభన్ మెఱయించు సత్తపః
పాండితిఁగన్న వాఁడట, ప్రభంజనవృత్తిఁ గవీశులందఱిన్.
ఖండనమందు గెల్చెనట, పాతికయేండ్లు వయస్సులేని వా
గ్మండితుఁడీతనింగనిన మాతకు "జే" యనఁజెల్లదే? సఖీ!

రమణీయార్థరసప్రపంచపథసారంగంబు, సౌందర్యవ
స్తుమనోలగ్నకళావినోది, జనసందోహంబు వాంఛించువా
క్కమనీయాద్భుతమూర్తి. ఏలలిత సత్కాంతామణీ హృద్యసం
గమ నిత్యోపవన ప్రదేశ విహరత్కామ్యార్థి యౌనో, చెలీ!

ఈతనితోడఁగూడి సుఖియించెడి భాగ్యముఁగాంచ ఏసతీ
చేతము స్వర్ణపుష్పముల శ్రీశుభజించుచున్నదో గదా?
ఈతరుణంబునందు నుతియించి నతించఁగఁ గోరుపాదుషా
చేఁ తనివార వారక కవీశునిఁ జేర్చుకఁబోడు సంపదన్.

అను నాలోపల చేరినాఁడు కవిసింహాగ్రేసరుండభ్రచుం
బన సౌధాంతర భర్మనిర్మిత కళావైదగ్ధ్య సంస్థానమున్
ఘనమాణిక్య వినీల నిర్మలలసత్కాంత్యైక ధామంబుఁబొ
ల్చిన దేవేంద్ర సభావిలాసమును ఢిల్లీ పాదుషా స్థానమున్.

కవితా రసాలపల్లవ ఖాదనవ్యగ్ర
కవికోకిలా రామ కంఠసీమ
చిత్రసౌందర్య సంసృష్టి తుష్టివిరామ
శిల్పులు నిల్చు విశిష్టభూమి

సిద్ధగంధర్వ విశుద్ధ గానకళాఢ్య
చతుర గాయకులుండు శాంతతలము
సర్వలోకవిశేష శాస్త్రార్థ నిర్ణయా
ఖండ పండితుల యుద్దండధరణి

మంత్రి తంత్రాంగ నిపుణులు మంత్రిదండ
నాయకులుగల్గు- దర్బారు- నవ్యసరణి
స్వాగతంబిడ- కవియు నవాబుఁగాంచి
మధురగతిఁబల్కె నాశీస్సుమంబులనిట్లు.

స్వస్తి- సమస్తభారత విశాల ధరాధర దివ్యతేజః వి
ధ్వస్త మహామహోగ్రరిపు ధైర్యవిరాజ! కళాప్రపూజ! వి
న్యస్తకవీంద్ర వాక్ప్రథిత నవ్యయశః పరిణద్ధ భోజరా
జస్తుతి నందుమా! విమలసద్గుణరాజివి, షాజహాప్రభూ!

అల్లాశక్తి- మొహమ్మదు ప్రవచన ప్రారంభ సంయుక్తి- మీ
కెల్లన్ దోడయి కీర్తివెల్గులను కల్గించేని- నిత్యంబుమీ
యుల్లంబందు నుదారభక్తిరస సంయోగంబునన్ మోక్షసం
పల్లాభంబుల నిచ్చి బ్రోచెడిని- ఆమక్కా- మదీనాస్థలుల్.

రసవాగ్రీతులు, భావబంధనుమక పారిచర్యగీతు ల్లిఖిం
చి- సముండెవ్వఁడు లేఁడు నాయశమునున్ జేకొన్న నన్నెవ్వరే
నిసరే- ఇచ్చట గెల్చినన్ జనని వాణీదేవియేసాక్షిగా,
లసదుద్భూత జయధ్వజమ్మువిడి గర్వంబేఁగ నేనేఁగెదన్,

అంత నవాబులేచి, హృదయాంతర తంత్రులు మోగ్రియునట్టుల
శాంతమనోజ్ఞ వాగ్విభవ సంగతుఁలుల్కు- కవీంద్ర! చూడ-మీ
యంతటివారలీ పరిధియందె కనంగనురారు- ఉండినన్
వింతగదా భవద్వచన వీరమునే నెదిరించ కుండుటల్.

ఐనను- దానికేమి? అయిదారు నిమేషములాజ్ఞఁజేసి- ఆ
స్థానములోని స్వర్ణమణి సంగత పీఠికపై వశించి, స
న్మానము స్వల్పమేయగుత-మద్హృదయాంబుజ కీర్తిపూర్తివి
న్నాణము గానొనర్చి, పరిణద్ధకృతార్థుని జేయుఁడీ కవీ!

సాహసంబున్నకవులార! సరగరండ
టంచు, పాడుషపల్కు విన్పించెగాని
ఎంతతడవైన నేనయేతెంతుననెడి
వాదమును జేయవచ్చెడి వాఁడెలేఁడు.

“కవి విశ్వేశు(డనంత కావ్యరససంక్రాంతాత్మ విక్రాంతసం
భవ భావోగ్రవిభూతిమూర్తి- ప్రశయాభ్రభ్రాంతవిద్యుత్ప్రభో
త్సవ చిత్తోన్మద నాట్యవర్తి-” అని సంధానించి నారందరి
య్యవె కేల్మోట్పులటంచు- తత్ప్రథిత వీరావేశ వాగ్వాదికిన్.

ఎదురై - పద్దెము చెప్పనేర్పుగలవా(డిచ్చోటనే లే(డు- స
మ్మదమోదాఖిల జీవవాక్ప్రసృతిసమ్మో వీనిగైర్వాణీ- లెం
డదె జోడింపు(డు చేతులీ కవికుల వ్యాహారహీరమ్ము పే
రెదపై(దాల్చి తరించు(డన్న పలుకుల్ హెచ్చించె నత్తేజమున్.

తనదర్పారున- ఇన్నియేండ్లును- వృథా- దర్పించి, అర్పించ(గా-
తినినారెందఱొ పండితోత్తములు- శక్తిన్ జూపరారేమి? ఊ
రును బేరుగా గనరాకపోయిరె? ఇసీ- రోషమ్ములేదోయటం
చని, డెందాన నవాబు చింతిలియు,- హర్షావేశియై- పల్కె(డిన్.

భారతరత్నగర్భ పరిపాలిత పుణ్యధరాతలమ్ములో,
నారయ నాంధ్రభూస్థల సమాగత మీకవిరత్నమే, వెలన్
తీరుపరానిదయ్యెను,- హృదిన్గల బింకములింకమాని, ద
ర్బారున నేటినుండి కవిరాజుగ- అగ్రపదంబునీయు(డీ.

నాయాస్థానమునందు- నేడుగ- జగన్నాథుండు నాథుండుగా
మీయాచార్య పదంబులుండు- ఇఁక- మీ మీదంబముల్వేడి- 'జే
జే' యంచున్ విజయాగ్రగామి యగు నీ సిద్ధప్రతిష్ఠోత్తమున్
హాయిన్ జేరి భజింపుఁడీ సకలకళ్యాణార్థ వాంఛాప్తులై.

* * * * *

నేఁడుగా- పాదుషాదివాణంబులోన
మారుమ్రోగించి కవియు శంఖారవంబు-
అఖిల పండితలోక దిశాంతరముల
వ్రాసికొన్నాఁడు "పండితరాయ" బిరుదు.

రెపరెపలాడి, పైపయికి రేఁగుచు నూఁగు జయధ్వజమ్ము- వి
శ్వపరిధి నాల్కఁజాచి, కవివాక్కులనంబు కలాన్నమన్న వా
క్య పరిచయం బొసంగినది- ఆరనివెల్గుల నాంధ్రమాతృ దీ
ప్తి పదపదారవిందపదవీ రుచిరాఢ్యత యింపునింపఁగన్.

అమలిన యౌవనస్థిత విహారమనోహర రాజహంసికా
గమన- నవాబుకుంగలుఁగు గాదిలి పెంపుడుకూతురైన సా
ధుమతి- లవంగిలో- కవి మధూదయశేముషిచేరి- చిత్తవి
భ్రమము సుదాత్తభావయుతరాగరసమ్ము వెలార్చెవింతగా.

ఆమె తొలిచూపులోన- విద్యానవద్యుఁ
డైన కవిరాజు- చిత్రరేఖాంచితముగ
మదనమోహనసంయుత మధురమూర్తి
నేర్పుఋపరానిదాని లిఖించినాఁడు
ఆయువని యౌవనాస్పృహ్యదంతరాళ
యువని కావ్యంతరాన, విహాసహాస్య
చంద్రికలుచిందు కవిచంద్రు సుంద్రిరుతులు
ప్రేమగీతార్థముల నాలపించుకొనెను.

పాదుషాప్రక్క- నిలచిలవంగి- పొంగు
వలపు సొలపుల కవిరాజపథమునందు.
పఱచి- లక్షించు- ఆతఁడు భాగ్యమనుచు-
అహరహమనంత సౌఖ్యవిహారి యగును.

“ మేలిరుచుల్ వెలార్చు పసమీరిన సత్కవితారసాల మీ
సాలము- దీనఁబ్రాకికొని సార్థకమొందిన జీవరాగస
మ్మేళము- చెప్పఁదగ్గదిసుమీ” యని యెంచునొ నూత్నపల్లవా
ఖాలసితాంతరంగిత శుభాంగి- లవంగి- కవీశుఁజూచుచున్.

అతిసుకుమారియై- నవనవాంచిత ముగ్ధసురూపరేఖయై-
అతనుసతిన్ జయించెడి మహాకృతియైన లవంగిఁగూడి, ఈ
మతహతనీచభూముల దుమారముఁబోనిడి, స్వర్గభోగ్యసు
స్థితహిత కర్మభూముల వసింపఁగఁగోరునొ? ఆకవీంద్రుఁడున్.

ఆమె సుశీతలామృత సితాబ్జముఖమ్ము మధూదయోగ్రవి
భ్రామిత దృష్టివృష్టితమనమ్ము వెలార్చ- కవీశుడెందమం
దా మరియాదయేమొ? ఎపుడారని తీరని పంతువెన్నెలై
తామురిపించు చుండునుగదా, మఱపించి, తపించులోకమున్.

చూపులుతూపులై విజయశోధనజేసినవో నవోదయ
స్థాపితదీపికాగ్రికర సజ్జితహృజ్జిత రాగశయ్యపై-
ఏపరిణామ సత్పరిణయేచ్ఛల నిద్దరియంతరంగ గా
థాపరిపూర్తి పూర్తిఁగని దవ్వులనవ్వుల నవ్వుకొన్నదో.

మేలిముసుంగు వైచికొని మేను తళత్తళవిద్యుదభ్రరే
ఖాలసితాంతరంగమున, కాంతులఁజిమ్మ- కవీంద్రసాంద్రభా
వాలపితోత్తమాంగమున- అల్లుకపోయిన వింత- ఇంతయే
నా లవలీలతాంగి తెలియున్ జనదో కనదో సుమింతయున్.

అచ్ఛా ముస్లిముకాంతయామె- అతఁడో- ఆదిత్యతేజోమయీ
స్వచ్ఛబ్రాహ్మణమూర్తి- ఇద్దరికెటుల్ సంబంధబాంధవ్యమౌ
స్వేచ్ఛలగ్గు? సృజించుతాత ఎటుహర్షించున్— వృథా- వీరిలో
ప్రచ్ఛన్నంబుగ గిల్గిలింతలవియేలా? చెప్పరాదేరికిన్.

*　　*　　*　　*　　*

నాఁడు- హజరతుమొహమ్మదు నరులఁబ్రోవ
నవతరించిన పుణ్యదినమ్ము- దీప్తి
నంది "అల్లాహుఅక్బ" రటన్నపదము
మస్జిదుందాటి- ఆకసమంటురోజు.

ఆ ముంతాజుప్రియుండు. శాంతహృదయార్ద్రాతి ప్రమోదుండునై,
ఏమో ప్రశ్నలఁజేయుచుండెడి అపరగీన్ హేలగా మెచ్చి, గా
రామై వెంబడిఁ దెచ్చి, సర్వజనపూర్ణంబైన దర్బారులో
సామోక్తుల్ పచరించు పండితుల యిష్టాగోష్టిలోఁ దేలుచున్,

గండురాళ్ళకును శృంగారహారతులని
ప్పించు శిల్పికినిచ్చె పెద్దమహలు,
సన్నని పదముల జాతీయతాసృష్టి
సల్పు కవికిచ్చె లక్షలువరాలు,
ముద్దుస్వరంబుల మ్రోడుల చిగిరించు
గాయకు కిచ్చెనమేయమణులు
యుత్తలఁ జెవులలోనూది రాజ్యమునుర
క్షించు మంత్రికినిచ్చె చిన్ననగరు

మించువెలలేని "ఈనాము" లంచునంది
యందరందిరమంద సానందగతులు
షాజహానాటి దర్బారుఛాయలందు
బహుమతుల నందఁబోని యభాగ్యుఁడెవఁడు?

ఆ జరీసాల్వాకై మిన్నందినాడు
కలితవాగ్మ్రందితోద్దండకవికుమారుఁ
డరయ– ఖడ్గంబునకె మహోహ్లాదమందె
సాహసోద్ధత భుజబలస్సైనికుండు

ఆ పరిషత్తులోన నుపహారమునందని రాయలొక్కఁడే
మోపరియోజసేయు– అతఁడుండిన యాస్థితినే పరీక్షకై
జూపఁగ– ఆనబాబు తలచున్ మనమందు– విలాసదృష్టితో–
మీపదమేమి విస్మృతి నిమీలితమైనద' అంచునగ్గుచున్

ఓహో! పండితరాయ! నేడిపట మీరూహింపఁబోనట్టి సం
దేహంబే జనియించె– సత్ప్రథిత వాగ్దేవీకిరీటమ్ము– క
ట్టా– హాస్యోచిత దుర్యశస్తమము తోడంగూడి నిస్తేజమై
రాహుగ్రస్త గ్రహంబుఁ బోలెనుగ– ఔరా– మీరు శంకింతురే.

హుక్కాఁగొట్టము, చేతఁబట్టుకొని రాజోద్వేగ చిహ్నముతో
సొక్కీసొక్కని నవ్వువెగ్గులను తాఁజూపించు దాడీపయిన్
చిక్కీచిక్కని రీతిహాస్యముగ ప్రశ్నించంగ రారాజు– ఏ
మొక్కలోని గభీరభావభవుఁడై ముద్రించి తల్లీనతన్.

కవి వచియించు- ఈసకల కావ్యకళామయ దివ్యలోకముల్
ప్రవిమలవృత్తి సృష్టిసలుపందగువాణికి మూఁడుకాలముల్
తివిరి- నమస్కరించును- "పదేపదిగా-" ఎవరేమిపల్కినన్-
తవుల దగౌరవమ్ము- సరిధర్మము వీడిననోయి, సత్ప్రభూ?

పరిణతబుద్ధిలేనియెడ- పామరవృత్తి, మదీయకాంతి సం
భరిత పదోచ్చగామినిని వాణినిఁజూచి నుతించువారలే
కరవయిరంచు బెంగఁగొని, గాసిలినానొకనాఁడు- కాని- త
చ్చరితము మెచ్చుకున్నను యశంబు తొలంగ దమూల్యమేయగున్

అబ్ధిరత్నమధోధత్తే
ధత్తేచశిరసాతృణం
అబ్ధేరేవహి దోషోయం
రత్నం రత్నం తృణం తృణం

దైవికమైన వర్ణముల దండగఁగూర్చి- కళాప్రపంచమం
దేవిధినో అహంకృతివహించి, చరించు కవీంద్రవాణికిన్-
ఏవెలయిచ్చి తృప్తినిడనెంచునో మానవుఁడంచునన్- వృథా
యీవిపరీతబుద్ధులకు నబ్బెడివేమి రసజ్ఞపోషణల్.

కవి వాక్యంబమృతాంశు శీతకరమై, కమ్రోర్ధ్వవిశ్వస్థలీ
భవితాభ్యున్నత వీథిలో- మెఱయ- సంభావింపఁగాఁగల్గువా
రెవరోయీ; ఇట- అల్పమానవుల? వారై యిచ్చు నాణెమ్ములా
చవకై పోయిన సాలువాల? మరి- రాజా! నీవె వాక్రువ్వుమా.

సభ హర్షప్లుత గాంగనిర్ఝరిణి- రాజా- విభ్రమాత్యద్భుత
ప్రభవోద్విగ్న శిరోగ్రసంఘటిత మర్యాదాంజలి స్థాపితుం
డిభజిన్మధ్య- లవంగి- కోరకితనిత్యానేక వాంఛాప్రపూ
ర్ణ- భళా- పండితరాయ సద్యశము వర్ణ్యంబయ్యె దేవాశికే.

పండితరాయతే నుడువ ప్రౌఢవిశాల విమర్శకున్ యశో
మండితుఁడా ప్రభుండు నతమస్తకుఁడై వచియించు- వాక్సుధో
ద్దండకళావిలాస నటదర్పిత సత్కవిరాజ! రాజితా
ఖండ విశేషశేముషికిఁ గైకొనుఁడియ్యవె- మన్నమస్కృతుల్.

మీరనినట్లు- స్వర్గమునకు మెట్లను గట్టఁగఁజాలునట్టి వా
గ్ధీరు కవీంద్రపల్కులకు- కేవలమూల్యము నిర్ణయించువా
రేరుజగాన- ఈప్రభువులిచ్చెడి స్వల్పములేమిలెక్క- కా
నీ- రసమూర్తి చంద్రునకు నీయఁగరాదొకొ నూలుపోగునేన్.

రసమూర్తుల్గద- మానవాభ్యుదయ విధాయింతుల్గదా- మీకునీ
పసలేనట్టి నవాబులీయఁగలదే భాగ్యంబదా? నాచిత్తమం
దిసుమంతేనియుఁ దోఁపరానిది- కటా- ఈదోషియేరీతిగా
లసదుత్ఫుల్ల కళాపతల్లికి యుణాగ్రిస్తుండు కాకుండునో.

ఈ పర్వంబున- దైవతుల్య కవిరాజేంద్రుల్ ముదంబందుతే
మాపారంగత సంపదాళికిని సన్మానంబుగాఁజూచి, స్వా
మీ! పాయన్ క్షమియించి, వాంఛితము నెమ్మిన్ జెప్పుఁడీ దేశమం
దీపాండిత్య కళాపరిపోషణకు, కీర్తిన్ నాకె రానీయుఁడీ.

అసమానోత్తమ సాహితీహితులు- విఖ్యాతాంధ్ర మూర్తిప్రభల్,
లసదాత్మోన్నత కావ్యకర్తలు, సదారాధ్యా! మహోదాత్తమౌ
రసగంగాధరులైన మిమ్ము కొలువన్ రాదా! వృథా నన్ను పా
పసమాతంకమునైన పంకిలముకే పాల్చేతురా, ధీనిధీ!

కోరికను దెల్ప బ్రతిమాలుకొనును- ప్రభువు,
బహూకృతులేల నంచనెడి— కవియు,
రాజ కవిరాజు లిరువురి రమ్యభాష
ణములకులికి- పలుక దపంచలము సభయు—

కలుషమెఱుఁగని కవి మనోగగనభూమి-
ఉదయరాగాంకుర ప్రభలొందిమెఱసె-
ఆతురతనందు యువనకన్యాహృదంత
రమున- కెరటాలువైచె- పేరాసలెవియొ.

లోతుల్ తీయఁగరాని భావమెదియాలోచించి, సర్వేశ్వరుం
డాతావుల్ విఱఁజిమ్ము పూవుల- విజాత్యాత్మక బద్ధంబుచే
నేతన్ జేయఁగగోరెనో- కవియు లక్షించెన్ లవంగీమనో
గీతార్థంబు- తదర్థసంభరిత దృగ్గీతుల్ ప్రబోధింపఁగా.

రాయలు పల్కెనిట్లు- మొగలాయికులోత్తమ! రాజశేఖరా!
నీయసమాన మానిత మనీషనుమెచ్చి, అసత్యశూన్యవా
క్ప్రాయమునెంచి. కోరుమనియాడిన నీపలుకూతగామనో
ధ్యేయము, వాంఛితార్థము వచింతు- రచింతువొ? మంగళార్థముల్

ఆడినమాటతప్పక- యథార్థము నీమనమందెచూచి, పో
నాడి విరూపశక్తుల- మహాత్మ! సృజింతువ? కావ్యపూజలన్
వేడుక కాదు- నాదియవివేకముకాదు- కళాలయంబులో
నీడగుదేవి విగ్రహము నీవె ప్రతిష్టను సల్పఁజూతువా?

నయాచే గజాలింనవా వాజిరాజిం
నవిత్తేషు చిత్తం నమేకించిదస్తి
ఇయం సుస్తనీమస్తక న్యస్తహస్తా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు.

మించి- వినవచ్చు కవివాణి యెంచరాక
విభ్రమాంబుధి మున్గె పృథ్వీవిభుండు
ముంచుకొనివచ్చు తలపులయంచు లెవియు
లేక, తలవంచుకొనె- లవంగికుమారి.

•గారాబంబుగ పెంచుకొన్న యవనీకన్యాలలామంబు నో
రారన్ జెప్పఁగనేల? పండితుని యర్ధాంగంబు వాంఛించియే
నోరూరన్ తలవంచి సిగ్గుఁగొనె, మాన్యుల్ మెచ్చరాకుండినన్
ధారాదత్తము చేయుటే తగునుగాదా....ఇద్దె....కర్తవ్యమో....

అనెడి సభ్యుల గుసగుసలాలకించి
పండితునికీయఁబడిన అప్రీతినెంచి
హిందుముస్లిము సఖ్యము నిచ్చగించి
కవిని పాదుష అల్లునిగా గ్రహించె.

* * * * *

అవిరామ ప్రథితోత్సవగ్రథిత కంఠాశ్లేషసంబంధ చి
త్రవిలాసాశ్రితులౌ లవంగియు రసాలంబున్ విమృశ్యంబులై
వివిధోద్భ్రాంతరతాంతరంగిత కళావేదుల్ విసర్జింపు- ఏ
భవితవ్యమ్మున బెండువారునో? రసప్రాపంచికోహ్యంబెయౌ.

అంగాంగంబులు మేళవించుకొని, స్వర్ణాంభోజ పత్రావళిన్
గంగాభంగతరంగసంగతులనైక్యంబొందు, ప్రేమార్ద్రస
త్సాంగత్య స్థితరాజహంసలకు నుత్పాతంబు సంధిల్ల నే
భంగిన్- కార్ముక మెత్తి వైచునో- కదా! పాపిష్టి- ఆకాలుఁడున్.

చిలుకయు, గోరువంక, ఎటుచేరి, చెలంగినవో నవీన ధ
ర్మలలితమానుషంగిక సరాగమధుప్రియసాసుభుక్తులై.
పలికెదరే ప్రిజాళి నవపాళి నవక్రమసాధుసత్క్రియా
దళితవిధుల్ మథించినటు- దారుణమెంచున? భావికాలముఙ.

ఆద్యంతంబులు కానరాని రసదుగ్ధాంభోధి వీచీరుచుల్
సద్యోనిర్మితసేతుఘట్టనల నాశంబొందుటే న్యాయమా?
ఆ- ద్యోతిల్లు నభస్థలంబున రహస్యంబాడు తారాద్వయం
బుద్యోగించిన సానురాగములమబ్బుల్ క్రమ్ముటే ధర్మమా!

చేతములుల్లసిల్ల, పటుశీతలతాలసదూర్మిలేఖికా
రీతుల స్నేహమెయ్యది స్ఫురించునొ, ఆనవపద్మయుగ్మము
ద్భూత సహస్రరోచికి "నమోనమ" యంచు నమస్కరించుటన్
జాతివిజాతి భేదముల సారములెంతుర? ఛాందసోత్తముల్.

చిత్తము హత్తుకొన్న పదశింజిత కావ్యవధూవిధానసం
పత్తికిలోఁగి, తచ్చరితవార్యిత్రమించిన సత్కవీచ్ఛలన్
చిత్తుగఁజూచి, వావిడచి చెప్పువిమర్శకులాకవిత్వ త
త్త్వోత్తమశిల్పకల్పితనవోజ్వలితాత్మకు ముప్పుతెత్తురే?

బ్రతికెడిదెన్నిరోజులను భావములేక, పరస్పరైక్య సం
స్థితి మధురాధరప్రకృతి సేవ్యతనూధరు లాత్మగీతిలో
శ్రుతులలయించి, ముక్తిఁగొనఁజూచెడివారల సత్త్వపఃప్రభో
ద్గతపరిణామకాంతుల వృథా సమయింతురె? తః నిశాచరుల్,

కల్పితరంగవల్లుల ధగద్ధగలీను హృదంతపీఠికన్
నిల్పి, అనల్పరాగరమణీయసుమాంజలిచ్చికొంచు సం
కల్పవికల్పభావముల కామితమంచుమనోజ్ఞుఁగొల్చు, వా
క్శిల్పుల నూత్నదంపతులఁజెందుట న్యాయమ? ఆవియోగముల్.

సరసహృదయానురతికి విహారమైనది
ప్రాజ్ఞుల మనీషకున్ రవరవలు కలిగి
మనుజసంఘాన మాయని మచ్చగాఁగ
సంఘటిలు వార్తయయ్యె- ఆశ్చర్యముగను.

ఒక శరదాగమంబునకె- ఉర్విరి- దంపతు లేయలౌక్యపే
మకృత మధూర్మికానికర మాధురులందిరో; ఏవిశాలరా
గకలిత నూత్నచంద్రికల- కమ్మని- తేనెలవానిరో? వినో
దకృతి విలీనమైనది సదాగతి స్వప్నకథాక్రమంబునన్.

ఆ మనోహరసుమాంగి లవంగి- తనకు
నిత్యసౌందర్యదేవియై నిలుచునంచు
నాశఁజెందు జగన్నాథుఁడనదవిధము
హృదిని వాపోవుచుండె ననేకగతుల.

తనయాత్మీయ కళాకవిత్వహృదయాంతర్జ్యోతి దుర్మార్గసం
ఘనికృష్టోద్ధత శాపవాయుహతమై- కార్మబ్బులీగుండెలో
నెనయన్ గప్పున నారిపోయినది- లోకేశుండు చిత్రించుకొ
న్ననితాంతాద్భుత చిత్రమిట్టిదని కానన్ బోఁచుగా- రాయలున్.

లవలేశంబును లోపమున్ గనక శిల్పాచార్య సంసృష్టి సీ
మ వెలార్చెన్ గుణరూపసంపదల - క్రమత్వంబు నక్రమత్వమున్
శివమై - సుందరమై - ఎసంగిన రుచిశ్రీరత్నమయ్యారె - ఎ
ట్లు విలుప్తంబయెనో - అటంచు కడు కల్లోలించు నారాయలున్.

అతఁడే సంపదలాసఁజేసికొని మ్లేచ్ఛాచార సంప్రీతి, ని
ర్గతతేజోధముఁడై లవంగిఁగొనె - యుక్తాయుక్తవిజ్ఞానశూ
న్యతలోఁగూడను పండితుండని జగన్నాథున్ విమర్శించు సం
తత చాదస్త మనీషదూషణల సంతాపించు నారాయలున్.

అపుడపుడే స్మృతుల్ కలిగి, అంతరమున్ గలఁగించి, చించునో
రెపరెపలాడి బాధఁగొను - రివ్వున - ఏప్రళయంబులార్చునో
అపరిమితంబుమూర్ఛఁగొను - ఆదినమాదిన మగ్నిపర్వత
ప్రపటు వికంపితోన్నతధరాతల సామ్యమునొందు రాయలున్.

హృదయముకోరుకొన్న మహితేచ్ఛలభించిన, ప్రేమదేవతా
వదనసదావిలాసిత రసజ్ఞతనందిన, ఏమిలాభమా
ముదిత ప్రియుంబెనంగొనిన మూఢసనాతనబద్ధబుద్ధులన్
విదళితపూర్ణజీవనగ విచ్చెనురేకులు రాలిపోవఁగన్.

చిఱునవ్వు చిగురించు శ్రీకవితావాణి
చెవులహోరున ప్రీతిఁజెందలేదు
మొగ్గలుతొడిగెడు ముగ్ధపండితదృష్టి
మూతకన్నుల- త్రోవ మొనయలేదు
పులకించికులికెంచు పూతరసాంతర్య
మగ్గిగుండెను శాంతినందలేదు
తలపించికరగించు తరుణకంఠాశ్లేష
మలతి చేతులలోన నిలువలేదు

కోరిపరిణయమాడిన కోవిదుండు
జాతికెన్ వెలిఁబడెనని- స్వాంతమెఱియ-
ప్రియునిపాటుకునై మనఃక్లేశమంది
సురిఁగిపోయె- లవంగి- కప్పురముఖాతి.

జాతిమతాలఁబోనిది, నిజాయతిఁగోరు కవీంద్రువాంఛకున్
లోతులెఱుంగదామె- అతిలోకవిలాసితవస్తుపూజ సం
జాత తపఃఫలమ్మనను స్వాగతమిచ్చు రసజ్ఞనాసలన్-
చేతులఁద్రుంచిపోయినదిసీ - కడుముగ్ధగదా- తలంపగన్.

పండితునాసఁజేసినసుభాగిని భోగినిగాక- భర్తకై
దండనమందె- ఆహృదయదర్పణమందు సుమించు సత్పతీ
మండితచేతనాలతిక మానితమై ప్రతిబింబమిచ్చెనో
దండి- దిశాంతవిస్ఫుటితదైవతశక్తి సుమమ్మువిచ్చెనో.

మిసమిసలాడుచాఁదినివె మేలిముసుంగుగ- ఏకళంకముల్
కసిమసగంగఁజోని శశికాంతులమోము- ప్రియాపవాదమే
ఘసముదయాతివృత్తమతి కాతరతంగని శాశ్వతమ్ముగా
గ్రసితమహాంధలోకములఁగాలిడి పోయెనదృష్టరేఖగా-

సన్ననివెన్నెలల్పిలిచె, సాద్వృతి, సత్యతపఃప్రభావభా
వోన్నతి బ్రహ్మచర్యవపుషోజ్జ్వలమూర్తికినార్తిఁగూర్చి, ని
త్యోన్నమితోత్తమాంగ పరియోజకళామతిఁజేసి, ఒంటిగా
చన్నది దూరతీరములసాఁగిలి— ఎంతతపించి పోయెనో?

సడియును సవ్వడిన్గనని సౌమ్యవిభాసురదివ్యలోకమం
దడుగిడి హాయినొంది, అమృతంబునుగ్రోలి, లవంగితోడుతన్
గుడుగుడుగుంచమాడి కొనఁగోర్కెలఁజేసిన రాయలేయిటుల్
విడివడిశోకవిహ్వల విభీకరలోకమునందెనయ్యయో.

ప్రేమలసీమలెంచికొని, పెంచె, లవంగినిపాదుషా- కడున్—
గోమునఁజూచికొన్నదలకోమలియా ముమతాజురాజ్ఞి, ఏ
మేమితలంచనేమియగు- ఏగె- మహోన్నతరాజసౌధవి
వ్యాపరదీప్తసుందర కళాభ్యుదయంబుబు నాటితోఁడనే.

ఏడులుపూడులుఁగాదరలి యెంతతపంబొనరించి కాంచెనో
పోడిమిమిన్నయైన పువుఁబోడిని రాయలు- ఐననేమి?- ఏ
వేడిమిసోకెనోసెగలవేగిన యీ సుకుమారరేఖికల్
జాడలెరుంగరాక తమసాలయమందె లయంబునందెగా.

అనురాగంబునకున్ సదర్థవిలసద్వ్యాఖ్యాంతరంగమ్ము- ని
స్వనితామేయ పదానురాగయుత కావ్యాంశమ్ము- ముంతాజు రా
ణినిబై కొన్న విషాదవేదనలు- అంధీభూతరోధోంతర
ధ్వనులై పోయి, అకాలరుద్రినటనోదంతఁబు వాకుప్పిచ్చెడిన్.

వ్రాల్చినశీర్షమెత్తఁడు- జబాబిడఁడన్యులు ప్రశ్నపై చినన్-
పోల్చఁగరానిరీతినయిపోయె నవాబులవంగిచింతతో-
కాల్చినకాష్ఠమై పొగలుగ్రమ్మినయాశ క్రమక్రమమ్మునన్
డాల్చె వికల్పరూపమనుతప్తసమీరవిఘాతధూతమై.

అలజగన్నాథు ప్రణయముద్రాధిదేవి
వీడిపోయినచిహ్నాగా- వీథులందు
జనులగుసగుసలేవియో మిణుగురులయి
సందెచీకట్ల నటనలుసల్పసాగె.

కన్నులనుండిజారి తొలుకాడు నవాంబుదవర్షధారలో
నున్నకవీంద్రుఁడే యచలితోన్నతశైవతకాద్రివోలునో–
ఎన్ని రసస్రవంతులిలకేగినవో గమనించలేఁడు- ఇం
కెన్నిదినంబులేఁగినవొ, ఎంచఁడు ప్రాణములేనిస్థాణువై.

ఆసౌందర్యకళావిలాస హృదయాంతాంతర్యసంసేవనా
ధ్యాసన్ ధ్యానసమాధిలోఁగల జగన్నాథుండు- ఆకస్మికో
ద్భాసౌద్ధత్యవియోగయోగమున, పాతాళంబునేచేరెనో
దోసంబెంచియు, ప్రాణవాయువులసద్యోరీతి- చేజార్చెనో.

మానిత రత్నభూషితసమంచిత సంపదలాదయాధిదే
వీనుతపాదపద్మములఁబ్రీతిసమర్పణఁజేసి, కాన్కగా
దీనతలో "ఋషిమహలు" తేజముడింగెను—జీవమేచనన్–
కానఁగనోపునే శవనికాయము తొల్లిటికాంతిరేఖలన్.

"హోర"ను- ఆఋషిమహాలునుండినదీప్తకళాలయంబులో
సారెకుసారెకున్- కనులజారు జలంబులమున్కలాడి, నో
రార వచింపనోపని రహస్యకథాకలనంబు జ్ఞప్తికై
బార- అనిశ్చయార్థమతిఁబల్కను రాయలు భావవీథిలో-

నారమణీయవాంఛలకసారతదైవము! నామనోజ్ఞభా
వారభటీ నటద్రససమంచితకావ్యము? నాయలంకృతుల్
కూరిచికొన్న సన్మధురకూజితగేయము! శాశ్వతత్వవి
స్ఫారమనోహరాకృతికి సంధిరెనెట్లపమృత్యుదోషముల్.

ఈశ్వరులోసలీనమయి- ఏగఁగనొక్కరసాధిసాధనన్
శాశ్వతవృత్తినందితిని, స్వర్గమదేలభియించెనంచునే
శశ్వదనంతహర్షయుత శక్తులనుండగ పర్వువెత్తునా
యశ్వముతూలుటన్ రథమయారె తునింగెనఖండఖండమై.

భగవద్భక్తపరంపరాగతమనోభావంబు— సౌందర్యవ
స్తుగణధ్యానమలౌకికంబు ఫలదస్తుత్యంబు సత్యంబటం
చుగదా పల్కుదురాబుధాళి- ఎటులీశోకాబ్ధిముంచెత్తిన
న్నుగతాసుంబలె చేసివైచినది మన్నున్ మిన్నులేకంబుగా.

నాయాధ్యాత్మిక తత్త్వరూపగుణరత్నంబబ్బె- సంసారసం
ధ్యాయాత్రిల్ సుగమంబులై వెలుఁగులావాసించు నంచెంచినన్
చేయింజార్చితి- పోయెరత్నమకటా- చిత్రంబు- చింతాకులా
ధ్యాయంబుల్ కనుపట్టెనావిపుల భావవ్యాప్తకావ్యంబులో.

నాధృఢనిశ్చయంబున- అనాహతనిత్యయశఃప్రదీప్తులా
పాదితమయ్యె- తూలిరిసుపాండితిఁగన్న శతాధికుల్ కవుల్-
నాది- సతమ్ము- శాశ్వతమనాదియునౌ ప్రియతత్వమిట్టులా
చ్ఛాదితమయ్యె కుత్సితనిశాచరసంఘమునందు ప్రేయసీ!

సకలజనాంతరంగములు స్వాగతమిచ్చు మనోజ్ఞరూపస
న్నికరము దోషదూషితమనీషమటంచు గణించి- సర్వధా
మకిలికి మాన్యతన్ దలచు మాంద్యులు ఛాందసులంతరించునా-
డిఁక- తనుగొందుమేమొ పృథివీస్థలిలోననె స్వర్గరాజ్యమున్.

ఆయుద్యానపుఁ బూవులీగిరులలోయన్ బూయుపుష్పంబులున్
సాయుజ్యంబునుగోరి శీర్షములవంచన్ స్వామిపాదంబులం
దేయౌదార్యముఁజూపునాతఁడు ప్రియా! ఏమెంచుచున్ మానవుల్
ఈయుద్ధంబుల జాతిజాతికని కల్పింతోప్రియనంతంబుగన్.

ఎంచఁగరానిఛాందసులయీర్ష్యకు- ప్రాణములిచ్చినావు- ఆ
లించఁగలేవు- నీప్రియుశపించు వృథాకృతదారుణార్థముల్
ఇంచుక చెప్పవైతివి- కృశించితివీవుతలంచుకొన్న- ఏ
మించులయంచునో- తవిలి- మించి- చరింతుముగాదె? నెచ్చలీ!

నీవున్నేను దలంచుకొన్న- ఎటులేనిన్- ధూర్తసంఘంబులో
తావుల్గోరుదుమా? అనన్యసుఖవిస్తారాగ్రలోకంబులన్
ఠీవుల్ చూపెడి యక్షకిన్నరులకంటెన్- మించి- పైఁబోదుమే
దేవీ! నీవ, యధైర్యమందితివి- సందేహాతివేలాబ్ధిలో.

“అనవతరంబు రూపలసదద్భుతమౌ భవదీయమూర్తి కాం
తిని సువిచారరేఖికల తేజముచిందు హృదబ్జపీఠికన్
ఘనముగనిల్పి శాశ్వతవికాసితభావసుమమ్ములుంచుకొం
దునె?” అనుకొంటి- చేరితివె? దూరపుకాంతులలీనమై- సఖీ?

“నీవేదైవము, నీవెశక్తివిగ, రాణీ! ఈశ్వరారాధనా
భావంబీవులయించుకొంటయె” ఇదేభ్రాంతిన్- తపంబెంచు తే
జోవాక్యంబులనర్థకంబగుచు- తోచున్నాకు- ఎన్నేండ్లకో
దేవీ! ముక్తిలభించి, శాంతిలునుభీతిన్జూపు శోకాగ్నులున్.

రససిద్ధిన్ గనఁగోరు నావిపులసారాచారధారావచో
విసరంబుల్ భవదీయలోచన కృపావీక్షణనర్థించి, నీ
రసమేయందె_ ఇదేమిన్యాయమమలారాధ్యత్వదీయాకృతుల్
కొసకీ ఘోరవియోగభోగముల నాకుంగూర్చెనా? ప్రేయసీ!

యవనీకన్యలభించునో కరగనీరై పారు భావార్ద్రిసం
భవవాగ్వాహినులందు పుష్కరము సంప్రాప్తంబు కానోప- సం
స్తవనీయంబగుస్వర్గమేల? అటుపై దైవత్వమేలా?— సదా—
అవనిన్ శాశ్వతముందునేనన వియోగాగ్నుల్ ఫలంబయ్యెగా.

చూడుము— పంజరంబునను శోకమునందెడియా శుకమ్ము నీ
జాడకు దృష్టులన్ బఱపి, సంతతమీపుపఠించు నాయికా
తాడితకృష్ణశీర్షకథ- తానుదలంచును- క్షిప్తివీడి మో
మోడుదమన్ననున్- కలచి- మూర్ఛలఁజేయు నగాధగాధలో,

అతివా! కన్నులమూసికొన్నను- పరిశాంతాంతర్యమున్ బొందినన్
ఇతరాలోచనలందినన్ విడువబోవిక్షిప్తులేవేళలన్
మతిలోహత్తిన నీదు చిత్తరువులో మాహాత్మ్యమే మోగదే
శ్రుతులంగొల్పన వీణయై ధ్వనులనించున్ శుద్ధగాంధారిలో.

ఉభయులమెంచుకొన్న సుమనోజ్జ్వల రాజిత మాలతీలతా
శుభసదనాంతరంబున విషూచి మరుత్ప్రళయంబెలేచె- నా
ప్రభకొడిఁగట్టి జీవితసభంబున- చీకటివాకలో- చనా
అభయమునిత్తురెవ్వరు? ప్రియా! మనుజాశన శాసనావళిన్.

శ్రీమతి! నీపదాంకిత విశేషమధుక్వణనంబు గుండెలన్
ప్రేమ విలోకలోకములఁబేర్మి సృజించెను- మాయరానివై
ఈ మధుర స్వనంబును జింతించిననాదగు జీవనాడులన్-
గోముగ నైతలల్లుకొను గోర్కెలఁజేసి వృథాశనందితిన్.

పరమార్థంబునుగోరు నా హృదయభావం బన్యమూహింపకే
స్థిరమైపోయెను ప్రేయసీ లలితమూర్తిన్ దృష్టిసంధించుటన్-
బరువై పోయెడి బావభారమున- ఉచ్ఛ్వాసల్ విడంబించు ప్రే
మరమాసంకలితాత్మదీపికకు క్షేమంబెంచలేనైతిగా....

ఆకాశంబున కావ్యలోక చరదభ్యాసాతితృష్ణా పర
త్త్వైకాగ్రింబున-పర్వులెత్తుగమనంబేగాని-సత్యంబు నా-
లోకార్థంబుల మర్మమే యెరుఁగదేరోజున్ కవిత్వంబటం
చో కాంతా! పరిహాసించు నీపలుకులే యుక్తంబులై - తోచెడిన్-

నా-యంభోధర జీవిత ప్రథమ సంధ్యానృత్త వైశేషికా
ధ్యాయంబిట్లు ముగింపునందుటలు న్యాయంబా! మయూరీ! సదా—
సాయఁసంధ్యల, లేగులాబులనభఃసౌవర్ణ్యమస్తంగత
ప్రాయంబై తమసాబ్ధిమున్గుటకె రూపంబందెనా? ప్రేయసీ!

అచ్ఛస్ఫాటిక దీప్తరూషిత కపోలాభ్యంతరోన్మీలిత
స్వేచ్ఛాభావమనస్కతా-వరలి— రాశీభూత మాహేశ్వరీ
స్వచ్ఛాత్మీయగుణైక్యతన్—తనియు—తోవంగోరితిన్‌గాని- ఈ
తుచ్ఛస్వాప్నిక భోగముల్ తలచి కాదో రాణి! సత్యంబుగా-

ఒకనాఁడున్నత శాంతభావములలో నూహించఁగారాని శీ
తకరాహ్లాద గభీరసింధుహృదయాంతర్యమ్ము- లోకంబులన్
వికలంబుంబొనరించు ఘోరచలదాభీలాగ్ని కీలాళికే
సకలాశాపరితాపితార్పణము శిక్షన్ బొందెనా? నెచ్చెలీ!

వాకిట లేగులాబులగు శాఖల పైఁబయినల్లిబిల్లిగాఁ
బ్రాకిన సన్నజాజిఁగల పందిరినుండి శశాంకరేఖికల్
సోకినవేళ- నీనయన సుందరదృష్టి సువృష్టులే ననున్-
తాకినవంచు- కల్పితవృథా పరితుష్టులు కష్టమౌ- ప్రియా!

ఉత్తమ సాహితీహిత మహోన్నతమూర్తికి నాకు, నేఁడు, క్రొం
గ్రొత్తవి కొమ్మలే మొలచుకొన్నను, కోయిల కూతలోనొ, వి
ద్యుత్తరళోత్సవంబులనొ, ఉజ్వలితామల మాలతీలతా
చిత్తములోనొ, నిన్ గనెడి శేముషిలేదు-నిజంబు-మానినీ!

కోపాటోపముఁజూపు నీచజనవాక్యారత్వముందాకి- సం
తాపంబున్ గను ప్రేయసీ హృదయ సంత్రాసైక శీలారతిన్
పాపాత్ముండ గ్రహించలేక మృతికిన్ బాల్చేసినానయ్యొ- నా
యీ పాండిత్యముఁగాల్పనా? వృథయెగాదే? రాజ్ఞి! జీవించుటల్,

అటు లశాంతతరంగితోన్నత మనోవ్యాపారపారీణ సం
ఘటనా కల్పిత దుఃఖసంకలిత రోగగ్రస్తుఁడై, ధ్వస్తుఁడై
తటకూన్యాభ్రిగతాంబుధింబడిన చింతామూర్తియైపోయి, సం
కటమై వ్రస్పినశేషజీవిత సమీక్షన్ జేయు నా రాయలున్.

అమృతకలశిని చిందించి, అఖిలభార
తము పునీతగఁజేసె సత్కవియొకండు-
విషపుపాత్రము నందించి, వేదవిదుల
మన్నప్రభువులు హాని సన్మానమనిరి.

ఇంతకు నేకృతజ్ఞతలనెంచని ఛాందసదృష్టిలోన సౌ
ఖ్యాంతముగన్నరాయలు యుగాంతము దన్క యశోరమా
త్యంత విలాసరక్తుఁడ[illegible] అభ్యుదయాగమ భారతావనిన్
సంతతపూజ్యపాదుఁడయి సన్నుతికెక్కి నటించి మించునే....

చాటున మాటునన్ పరుషసంగతభాషణముల్ గమించి వా
చాటులగుంపులుండు పరిషత్తుల శ్రీముఖముల్ గమించి మో
మోటములేక గూర్చిన వమోఘరసైక సుకీర్తిమూర్తి న
య్యో! టకటొంకు చెద్దముల నూహలఁజేయద భావికాలమున్.

వాడిన లేగులాటి సుడివారుతుఫానులలోన లీనమై
పాడరి నాలుగేండ్లు చనవచ్చిన- శ్రోత్రియములుచ్చి పోవువా
క్తాడిత దూషణల్ చిలుకు క్రౌర్యసమాజము శాంతినందలే
దాడిన యాటగా సహజమైనది రాయలదూసిపోయుటన్.

ఛరమైపోయిన జీవిత క్రమము సంబాళించగారాక- చె
చ్చెర లోకావధులఁ జయించి- ఎటువేంచేయంగ- కామించునో
స్థిరబుద్ధిన్ బ్రిచురించు పండితుని వాగ్ధీరత్వమువ్వెత్తుగా
చరచేఁ బాహులు సర్వపండితుల రచ్చస్నీడ్చు వాంఛామతిన్.

సకలామ్నాయ విశేషపాండితీ మతిస్థైర్యంబు మాదంచు- మే
మొకదా దైవతతుల్యపూజ్యులము- మమ్మెగాదె భూదేవతా
ప్రకరంబంచు నుతించులోకమని సంభావించు వారందరున్
ప్రకటించుండు భవత్పవిత్రమతసారంబల్ల కాశీపురిన్-

కవితల్ చెప్పుటలో జయించనివి మీకావేశ కార్పణ్యముల్
మిపులన్ జొచ్చినవాఁడిపోయుట నెదోమ్లేచ్ఛంబటంచుఁ—సరే-
అవురా! నన్నెస్పృశింపరాదొ భవదీయాఖ్యానమే సత్యమో-
వివరింపన్వలె నేఁడెదుర్కొనుఁడు నన్ విశ్వేశువాసస్థలిన్.

ఉభయులకు మధ్యవర్తిని- ఉండఁదగిన
ఘనతఁ గల్గినదొక్క- గంగాభవాని
ఆమె సన్నిధినే మన యంతరములు
వ్రాయఁ బడునయ్య కాశీ వేంచేయుఁ డయ్య"
అనెడి ప్రకటన గాంచిన అయ్యలంత
వినుగ నవ్వెరి రాయల వెఱ్ఱిపనికి
"ఇట్టిమ్లేచ్ఛుఁడు కాశిని మెట్టునంట
ఎట్టికర్మ"మటంచు దూషించుచుండి.

*　　*　　*　　*

అకలంకాత్మ వినిర్మలప్రతిభలాశాంతమ్ము బాలారుణ
ప్రకటీభూత దినోత్సవంబులయి వెల్గంగా- నిజౌన్నత్యరా
జికి రాజీవరజః పరీమళమరుత్సేకంబు సుస్వాగతం
బుకరంబీయఁగ-చేరె- రాయలు- స్వయంభూవోలె గంగాతటిన్.

నీతికి స్వస్తి జెప్పి, అవినీతిగమ్లేచ్ఛ మతప్రచారసం
జాతవిహారచిత్తుఁడయి జాల్ముఁడునౌ కవిగారి నెన్నొసన్
వ్రాతలుతేలిపోవ శుభలగ్నము వచ్చెను రండురండటం
చాతత వేగగాములగు నయ్యలసందడి దందడించగా-

వేనకువేలు చేరిరి- గభీర సుధీరనుదారమూర్తియౌ
జ్ఞానవిశాలవర్తినికి సన్మతిగంగకుఁ జేరువౌచు నె
మైనను రాయలన్ గదిసి- హాస్యములాడి- తిరస్కరించి- సం
ఘాన- తలంచరాని గతికల్పన చేయు మహాప్రియత్నులై -

ఒజ్జల్ శిష్యులు కూడివచ్చిన విలాసోద్విగ్న యత్నంబులో
కజ్ఞానన్నను కాలు త్రవ్వ గుణమే కన్పించు- న్యాయంబునున్
పజ్జన్ జేర్చునుదారుఁ డొక్కఁడును గన్పట్టండు- శాస్త్రంబులన్
బొజ్జన్ బెంచిననే పవిత్రితయొ? ఆపూతాత్మయే చెప్పదో!

సాంగోపాంగము వేదశాస్త్రములు సర్వల్ చేయు ధీమంతులిం
గాంగీభూత కళాకవిత్వవిద విద్యావంత సామంతుఁడున్
గంగాపుష్కరిణీ తటంబునకు రాకంజేసి మందీపలత్
భంగాపాంగ శుభాంగయౌ త్రిపథగాజ్ఞాక్షిణా విలోకించనౌ-

చింతల్ తూలఁగ- పాపముల్ డులుచు రాశీభూతపుణ్యాత్మ- అ
త్యంతంబున్- తిరణాలుగా జనుల నాహ్వానించుక్షేత్రంబు- నేఁ
డెంతో వింతగఁ దోచె- గుంపులజనంబేతెంచ- సంద్రంబులే
చెంతన్ యాత్రికు వచ్చెనే మొయనుచున్- చిత్తంబులాశంకిలన్-

అంత- పండితరాయలాయత్తమైన
చిత్తమున- గంగమొగముగ- చేరినిలచి-
పైన- సోపానభాగమందే- నమించి-
పరమ భాగీరథిని- ఇట్లు- ప్రస్తుతించు-

శ్రీమద్వైష్ణవ పాదసంజనిత మూర్తిశ్రీ విడంబించ- వే
గామేయాద్భుత వాహినుల్ మలచి, భూమ్యాకాశపాతాళముల్
సీమల్ గొన్న సమృద్ధ భాగ్యగుణరాశీ! గంగ! నీయున్కిచే
క్షేమంబున్ గని సృష్టియంతయు- ప్రకాశించెన్ యథోజ్వల్యమై-

ఉర్వితి సర్వస్వమఖండభూతల రమాశోభావిలాసంబు సం
స్తుతపీయూష రుచిప్రదీపితమసంతోషపరిహారంబు స
ద్గతికై నీజలమూనఁ గోరుదురు మాతా! పాపి పాపంబువో
గతభాగ్యుండును భాగ్యముల్ గొనును నీ కళ్యాణమూర్తిగా గనన్.

సుకృతంబన్న నెరుంగఁ బోనిజనుఁడున్ - చోద్యంబు- నీదర్శనం
బొకమాఱైన నొనర్చుకొన్న దివిషద్యోగత్వముం బొందు- నీ
యకలంకాత్మ రసానుభూతి సురసేవ్యంబై తనర్చున్- సదా-
ఇఁక నాచింతలడంచు భారమదినీదే నందునో జాహ్నవీ!

అంబా! నీయవలంబనంబు కలదం చత్యంతగర్వంబు సా
జంబై- దైవతకోటినేని గణియింపన్ లేదు- నాకీవు సా
యంబుఁజేయక- యూరకున్న- నరకాయాసంబెప్రాప్తంబు- ధ్యే
యంబౌ త్వత్కరుణాసుధారస మపేక్ష్యంబౌను- భాగీరథీ!

తల్లీ! రాజ్యము త్యాజ్యమంచును- విరక్తాలీఢ తృష్ణాగతో
త్ఫుల్లాసక్తిని- రాజరాజులె- నినున్ బూజింపఁ గాంక్షింతురీ
కల్లోలించు భవత్తరంగలసదం[illegible] సత్సంగతిన్ -
చెల్లింబోవె మదీయ పాపకలుషాశేష పరిదోషంబులున్-

ప్రత్యూషంబున దేవయోషిదురు సంరంభప్రభాస్నాన సాం
గత్యావృత్త పరీమళన్మృగమదోద్గార స్రవంతీతతిన్-
నిత్యస్వాంత సుశాంత కాంక్షిత జనానీకంబు- వే- మున్గినన్
సత్యస్వర్గ సుమార్గ మిత్తువుగదే- సన్మూర్తి- భాగీరథీ!

ఘోరా! నీనిజ తత్త్వమెంతగను నిత్యంబో విశుద్ధంబో, వి
స్తారాచార చరత్ప్రవాహ మతివో సౌందర్యరాశిఞా నినున్
ధీరాత్మీయ జటానట ద్రుచిరమూర్తింజేసి- గౌరీప్రియుం
డారాగోదయ పుష్పగుచ్ఛముల నారాధించుగా? జాహ్నవీ!

నరులెన్నేండ్లు తపించియున్న- బహుదానధ్యాన సంధాన త
త్పరులై యున్న- కనంగనోపని- పదప్రాచుర్యసంప్రాప్తి- త్వ
ద్వరపీయూష జలార్ద్రచిత్తునకు, తప్పంబోదు- నిన్ నమ్మ- నా
దురితంబుల్ తొలగించి, చేకొనుటయేదోషంబ? శాతోదరీ!

బధిరాంధ ప్రకృతి స్వరూప వికల ప్రారబ్ధమూకాత్మలన్-
అధనాశా దురితారి సంగ్రసిత భావావేశ మూఢాత్మలన్-
మధురార్ద్రప్రసృతుల్ లగించి- కడు- సన్మానించు చశ్రాంతమున్-
విధివిశ్రాంతులులేక సాగెడిదిటఞా వే రెవ్వరో? స్వర్ణదీ!

సగరుల్ శాశ్వత మోక్షమందుటలు- ఆ జహ్నుండు నిత్యంబునీ
ప్రగతిన్ లీనమునంది, పేరుగొనుటల్- భావించసామాన్య మే-
సుగమంబై వెలుగొందు తద్ధృదయరోచుల్ నన్నుముంచెత్తి భ
ద్రగతిన్ నిద్రలఁ బుచ్చ నీయెడిని- మాతా! ధన్యతన్ బొందనే-

కానన్- ధర్మనిధానమున్- విమల మోక్షానంద సంధానమున్-
జ్ఞానధ్యానవిధానమున్- సకలవాంఛాళీ సమాధానమున్-
దీనజ్యాపరిధానమున్- ధరణికాతీర్థప్రధానంబు నౌ-
నీ నైజాచ్ఛపునీత తత్త్వమెటులేనిన్ బ్రోచునన్- జాహ్నవీ!

మరుదుల్లోలదమేయ సల్లహరికా మాన్యార్ద్ర పూర్ణాంబుజ
స్ఫురదౌజ్జ్వల్య విలాసపాంసుపటలీ శోభాయమానంబునై -
సురకాంతాతనులిప్తసాగరుగురుజ్యోత్స్నాతిజంబాలమౌ
వరభాగీరథి తోయజాలమిఁక సంప్రాప్తించు నన్ బ్రోవఁగన్.

మదియోగ్యంబు నయోగ్యమున్ దెలిసి సన్మానించుకోలేని యీ
మదిరాపాన విఘూర్ణచిత్తుల మహామాలిన్య సంఘంబులో-
ఎదురౌ ధర్మ విధర్మ మర్మముల నెన్నేఁ జూచివేసారితిన్-
సదయామూర్తి! లయంబుఁ జేసికొని, విశ్రాంతిన్ బ్రసాదించుమా.

జననంబెంచితిమా, రమా రమణ పూజ్యార్ఘక్త పాదాబ్జ మం
దెనయన్- కాపురముంటయా- శివజటాహేలాతి జూటాగ్రమం
దనగా- కొండలసందడింబడి ప్రవాహంబందు నెవ్వారికీ
ఘనతల్ కల్గినవమ్మ- దీను నను రక్షంజేయుమా జాహ్నవీ!

అమ్మా! మ్లేచ్ఛుఁడనంచు జాతివెలిఁ జేయంజూచి- ఓర్వంచి- స్వా
ర్థమ్మే యర్థము గాఁగ కర్మఠులు వ్యర్థంబెంచ హర్షించి, న్యా
య్యమ్మున్ జూడని ఛాందసాళికయి, భార్యన్ మట్టుబెట్టించి, హై
న్యమ్మీ దేహమునేలఁ బూనవలె? స్థానంబిమ్మ నీలోననే........

రాయల్ పల్కినశ్లోక మొక్కొక్కటి, యేరక్తిన్ బ్రదర్శించుటన్
న్యాయంబెంచునో? గంగ- పొంగులిడి- ఏకైకమ్ము సోపానమున్
రాయన్ జొచ్చుచు- మెల్లమెల్లన తఁడారాధించు దిక్కౌచు- రా
నాయెన్ లోకము వింతనంద శతసంఖ్యాక్రాంతసోపానయై-

కవియాక్రోశము దిగ్దశాపరిధి సంక్రాంతించి, శాంతించు- నాఁ
డవినాభావము నీకు నాకనుచు వ్యాహారించు భాగీరథీ
భవకమ్రామృత వాహినీతతులు సంభావించి- ఉవ్వెత్తుగా-
ఛవులన్ జిమ్ముచు- కౌగిలించుకొన- స్వచ్ఛాత్మీయ సత్పండితున్

స్థిరమై—శాశ్వతమై- చెలంగు కవితాశ్రీయుక్త పీయూషవా
గ్ఝరులుత్తుంగ తరంగ సంగమిత గంగావాహినుల్గాఁగ- ఇ
ర్వురకున్ భేదములేక- ఐక్యమయి- సారోదారతద్భారతీ
గురుగాంభీర్యవిశాల సీమలకు సాగున్-నాఁడు- సాశ్చర్యమై—

* * * *

విసమున్ జిమ్మిన ఛాందసుల్ గన- సభాపీఠంబుపై నున్న- అ
య్యసముం గంగధరించిలోఁ గొనుట సత్యంబౌను నిత్యంబుగా-
ఎసగన్ చిత్రవిచిత్రమేమియగు నూహించన్- జగన్నాథునున్
రసగంగాధరుఁ డన్న నామమెయథార్థంబయ్యె నిద్ధాత్రిలో....



అచ్చులో —

శాంతినికేతనము (నవల)

జానకి (పద్యకావ్యము)

అక్షయమాణీరము (ఖండకావ్యము)

ప్రతులకు :-

వాణీ బుక్ డిపో,

భీమవరం.